# తెలుగులో స్వీయ చరిత్రలు




డా॥ అక్కిరాజు రమాపతిరావు

# తెలుగులో స్వీయచరిత్రలు

డా॥ అక్కిరాజు రమాపతిరావు, 'మంజుశ్రీ'

ప్రచురణ




రిజిష్టర్డ్ సంఖ్య 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

**TELUGULO SWEEYACHARITHRALU**
An introduction to Autobiographies in Telugu
By Sri Akkiraju Ramapathi Rao, 'Manjushri'



యువభారతి

ప్రచురణ : 101

ప్రథమ ముద్రణ : ఏప్రెల్ 16, 1984

ప్రతులు : 2,200

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడా, హైద్రాబాద్.

ముఖచిత్ర ముద్రణ :
గీతా ఆర్ట్ ప్రింటర్స్
కాచిగూడా, హైద్రాబాద్.

ప్రతులకు :

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

వెల : రూ. 4/-



# యువ భారతి పరిచయం

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరవయ్యేళ్ళుగా పాత కొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూరు పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాస మంజరి కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ, తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని, ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారత దేశంలో ఎక్కడున్నా సరే, యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 8500 సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతీ భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1000 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

ఇరివెంటి కృష్ణమూర్తి

హైదరాబాదు

16-4-1984

అధ్యక్షులు, యువభారతి



# మా మాట

"సత్యం వద. ధర్మం చర" అన్న ఆర్యోక్తికి అనుగుణంగా బ్రతుకును మలచుకున్న మహనీయుల అనుభవాలను వారు స్వయంగా చెబుతుంటే వినాలనే కుతూహలం "మంచియన్నది పెంచా"లనుకునే వాళ్లకు సహజంగానే ఉంటుంది. తమను పొగుడుకునేవాళ్ల కథనాలను, పరులను తెగిడేవాళ్ల కథనాలను ఎవడూ పట్టించుకోడు. కనుకనే ఏదో ఒక రకంగా ప్రసిద్ధులైన వాళ్లంతా తమ జీవిత కథలను తాముగా వ్రాసుకోలేకపోయినారు. స్వీయ చరిత్ర రచన త్రికరణశుద్ధిగా చేసే తపస్సు వంటిది. కన్నదీ, విన్నదీ, చదివిందీకాక తన అనుభవంలోకి వచ్చిన అంశాన్ని ఇతరులకు తెలియజెప్పే ప్రయత్నం చాలా సాహసంతో కూడు కున్నది. తానొక మంచి పనికి పూనుకున్నప్పుడు తనకు ఎదురైన కష్టాలు, తనకు లభించిన ప్రోత్సాహం, తనకు తోచిన మార్గం ఎందరికో కరదీపికలు కావచ్చు. ముఖ్యంగా సంఘ సంస్కరణకు, స్వాతంత్ర్య సమరానికి, సాహిత్య వైజ్ఞాని కాంశాలలో వినూత్న ప్రయోగానికి ఉద్యమించిన వ్యక్తి అనుభవాలు సాధారణ మైనవి కావు. కాని అవి ఎందరో సాధారణులకు మార్గదర్శకాలు అవుతవి.

ఆత్మాశ్రయ కవిత్వం లాగే ఆత్మకథా రచనం ప్రతిభావంతుల వంతుకు వచ్చినప్పుడే సఫలమవుతుంది, సుందరమవుతుంది, శివంకరమవుతుంది, సత్య మవుతుంది.

నవల, పత్రికారచన, వ్యాసం వలెనే 'స్వీయ చరిత్ర' అనే ప్రక్రియ కూడా మనకు పాశ్చాత్య సాహిత్య ప్రభావంవల్ల వచ్చింది. యుగపురుషుడు కందు కూరి వీరేశలింగం పంతులు తొలి స్వీయచరిత్ర రచనకు శ్రీకారం చుట్టినాడు. ఆ మహనీయుని ఒరవడివల్లనే మనకిప్పుడెన్నో స్వీయ చరిత్రలు వచ్చినవి. ప్రతిభామూర్తులు, త్యాగమూర్తులు, సత్యాశ్రయులు మాత్రమే స్వీయ చరిత్ర రచనకు పూనుకునే పద్ధతి ఏర్పడింది.

'తెలుగులో స్వీయ చరిత్రలు' అనే ఈ పుస్తకాన్ని మిత్రులు డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు వ్రాసి యువభారతికి ప్రచురించుకునే అవకాశం కల్పించినారు.

పఠితృలోకం ఆయన్ను 'మంజుశ్రీ'గా గుర్తిస్తుంది. వీరేశలింగంగారి సాహిత్యాన్ని సమగ్రంగా పరిశీలించి, ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి డాక్టరేటు పట్టంపొందిన మనీషి. నవలా రచయితలు, కథకులు, విమర్శకులు, వక్తలు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి గ్రహీతలు. బహుగ్రంథ ప్రణేతలు. మా యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూత నిస్తున్న సహృదయులు. మా 'యువభారతీయు' లందరికి స్వచ్ఛ స్నేహాన్ని పంచి ఇస్తున్న ప్రేమమూర్తులు. తెలుగు సాహిత్యంలోని ఈ అపూర్వ ప్రక్రియను పరిచయం చేస్తున్న ఈ పుస్తకం మాకు వ్రాసి ఇచ్చిన 'మంజుశ్రీ' గారికి మా కృతజ్ఞతలు, అభినందనములు.

'యువభారతి' సాహిత్యోద్యమానికి ప్రోత్సాహాన్ని అందిస్తున్న భాషాభిమానులకు మా 'రక్తాక్షి' ఉగాదిపర్వ శుభాకాంక్షలు.

ఈవేళ తెలుగు వైతాళికుడు, యుగపురుషుడు, వీరేశలింగంపంతులుగారి జన్మదినం. ఈ సందర్భంగా ఆ మహాపురుషుని దివ్యస్మృతికి చిహ్నంగా ఈ పుస్తకాన్ని ప్రచురిస్తూ శ్రద్ధాంజలి సమర్పించుకుంటున్నాము.

హైదరాబాద్
16-4-84

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు



# ముందు మాట

తెలుగు సాహిత్యంలో స్వీయ చరిత్ర అనేది ఆధునిక ప్రక్రియ. ఆత్మ కథ అనీ, ఆత్మ చరిత్ర అనీ, అనుభవాలు జ్ఞాపకాలు అనీ, గత స్మృతులనీ కూడా యీ ప్రక్రియను మనం వ్యవహరిస్తున్నాము. స్వీయ చరిత్ర అని యీ ప్రక్రియను పిలవటం తప్పని కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు వీరేశలింగం పంతుల్ని ఆక్షేపించారు కాని, ఎనభై ఏళ్ళుగా యీ ప్రక్రియకు ఈ పేరు బాగా వాడుకలోకి వచ్చింది.

ఆధునిక తెలుగు సాహిత్యంలో మొట్ట మొదటి స్వీయ చరిత్ర ఎవరిది? అని ఇటీవల ఒక వివాదం తలయెత్తింది. అజ్జాడాది భట్ల నారాయణ దాసుగారే స్వీయ చరిత్ర ప్రక్రియను తెలుగులో మొదటిసారి పరిచయం చేశారని ఆయన జీవిత చరిత్రకారులు వ్రాశారు. కాని ఇది సరికాదు. నారాయణ దాసుగారు తమ జీవిత కాలంలో మొదటి ముప్పై సంవత్సరాల చరిత్ర వ్రాసినమాట నిజమే. ఆయనకు ముప్పైఏళ్ళు రావటమంటే అది 1894 వ సంవత్సరం అవుతుంది. ఇంతకు పూర్వమే వీరేశలింగం తన జీవితంలోని ముఖ్య ఘట్టాలను అక్షరబద్ధం చేసిన దాఖలాలున్నాయి. ఆయన స్వీయచరిత్ర ద్వారా యీ విషయం తెలుస్తుంది.

తాను స్వయంగా తన జీవిత గాథను చెప్పటమని ఈ ప్రక్రియకు అర్థం. ఆధునికమైన రూపరేఖలతో, ప్రమాణాలతో తెలుగులో వెలువడిన మొదటి స్వీయ చరిత్ర వీరేశలింగంపంతులిదే. ఈ డెబ్బై సంవత్సరాల కాలంలో సుమారు నూరు దాకా స్వీయ చరిత్రలు వెలువడినట్లు ఒక అంచనా వేయవచ్చు. ఇంతేకాకుండా స్మృతులు, జ్ఞాపకాలు, కథలు గాథలుగా కూడా స్వీయ చరిత్రాత్మక సంబంధ రచనలు కొన్ని వచ్చాయి. వీటన్నిటిని పరిగణంలోకి తీసుకొంటే పందొమ్మిది, ఇరవై శతాబ్దాల ఆధునిక తెలుగు దేశపు సాంఘిక, సాంస్కృతిక చరిత్రకు విలువైన ఆధార వాఙ్మయం లభిస్తుంది.

స్వీయ చరిత్ర వచన ప్రక్రియగానే ప్రాచుర్యం పొందింది. మండపాక పార్వతీశ్వరకవి, తిరుపతి వెంకటకవులవంటి వారు కొందరు పద్యకృతిగా ఆత్మ చరిత్ర రచించిన వాళ్లూ లేకపోలేదు. అత్యంతాధునికులలో కూడా జాషువా, తుమ్మల సీతారామమూర్తి, పెనుమత్స సత్యనారాయణరాజు మొదలైన వారు పద్యకృతులుగా స్వీయ చరిత్రలు వెలయించారు. కాని ఆంగ్ల సాహిత్యం లోనూ, తెలుగులోనూ కూడా స్వీయచరిత్ర అనగానే అది వచనరచనగా ఉండటమే పరిపాటి అని రూఢమైపోయింది. కాబట్టి తెలుగులో స్వీయ చరిత్రలను గూర్చిన స్థూలమైన యీ సమీక్షా పరిధిలో పద్యకృతుల రూపంలో ఉన్న ఆత్మకథలను తీసుకోలేదు.

కల్పన కన్నా కూడా యదార్థమే ఒక్కొక్కప్పుడు అద్భుతంగా ఉంటుం దని ఒక సూక్తి ఉన్నది ఇంగ్లీషులో ("ట్రూత్ యీజ్ స్ట్రేంజర్ దేన్ ఫిక్షన్"). అందువల్ల స్వీయ చరిత్ర చాలా ఆకర్షకమైన సాహిత్య ప్రక్రియగా చెప్పవచ్చు. ఒక సంఘంలో ఒక కాలంలో ఏయే పరిస్థితులు ఏయే పరిణామాలు తెస్తాయో, వాటి క్రమబద్ధత ఏ విధంగా ఉంటుందో మేధావులైన వారి స్వీయ జీవితానుభవాల వల్ల తెలుసుకోవచ్చు. సాంఘిక ఆర్థిక రాజకీయ మత నైతిక సాంస్కృతిక పరిణామా లన్నిటికీ ప్రాతిపదికమైన, మానవ జీవితసంబంధాలు స్వీయ చరిత్ర ద్వారా ప్రతిపాదితమైనట్లు తక్కిన ప్రక్రియల ద్వారా ప్రతిభావంతంగా, ప్రభావశీలంగా ఆవిష్కృతంకావు. ప్రత్యక్ష కథనం కాబట్టి ఇవి పాఠకులపై జరిపే ప్రభావం అనల్పం.

సాహిత్యం పాఠకుడికి ఉత్తమసంస్కారం అలవరిచే ప్రయత్నం చెయ్యకపోతే అది ఉత్తమ సాహిత్యం కాదు. సంఘ జీవనంలో జ్ఞానమంతా ప్రత్యక్షానుభవపూర్వకంగానే సముపార్జనం చెయ్యడమనేది కుదరదు. పెద్దలైన వారి జీవిత ఘట్టాల నుంచి, సమస్యల నుంచి, పరిష్కారాల నుంచి, ప్రబోధాల నుంచి అనుభవాల నుండి వారసత్వంగా అనుభవం మానవుడికి తోడుపడుతుంది. సాహిత్యపరంగా చూస్తే ఇందుకు స్వీయ చరిత్ర మించిన సాధనం మరొకటి లేదు. స్వీయచరిత్ర కథించే వ్యక్తి జీవిత వైశిష్ట్యానిబట్టి, తరతరాల జాతి జనులకది దారిదివ్వె అవుతుంది. కాల సంద్రపు సైకతతీరాల మహాపురుషుల అడుగుజాడలు మానవాళికి మనోనిబ్బరం ప్రసాదిస్తాయని ఒక ఆంగ్ల మహాకవి అన్నాడు.

భారతదేశపు ఆధునిక చరిత్రను అనేక కారణాలవల్ల ముందుతరాలవారు స్థిరంగా మననం చేయవలసి ఉంది. ఆ చారిత్రక శక్తులను సృష్టించిన మహనీయులు, విశిష్ట వ్యక్తులు స్వీయ జీవితానుభవాలను గ్రంథస్థం చేసినప్పుడు వాటి నుంచి జాతిజనులు ఎంతో స్ఫూర్తి పొందగలరు. వివిధ రంగాలలో ఉత్తమ కృషి చేసి తెలుగుదేశానికి చెందిన మహనీయులు కొందరు స్వీయచరిత్రలు వ్రాశారు. తెలుగువారికి వాళ్ళందించిన సంస్కారాన్ని సంక్షేపంగా పరిచయం చేయ్యడమే యీ చిన్న ప్రయత్నం.

సమకాలీన సాహిత్య సంస్కారోద్దీపక సంస్థలలో యువభారతి తనదైన విశిష్ట వ్యక్తిత్వాన్ని సుమారు రెండు దశాబ్దాలుగా ప్రసరింప చేస్తున్నది. మానవ సమాజపు సార్థకమైన మనుగడకు మంచి పుస్తకం ఆవశ్యకత చక్కగా గుర్తించిన సాహిత్య సంస్థ యువభారతి. పది కాలాలు పది కలాలకు బలం ఇవ్వాలి. యువభారతి స్ఫూర్తినివ్వాలి.

ఈ అవకాశం నాకిచ్చినందుకు యువభారతికి నేనెంతో కృతజ్ఞుణ్ణి.

హైదరాబాదు
16-4-1984

అక్కిరాజు రమాపతిరావు

# 1. స్వీయ చరిత్రలు ఎందుకు చదవాలి?

మానవ జీవితం ఒక మజిలీ. ఈ మజిలీలో మానవుడు తాను కష్టాల పాలుగాకుండా, సంఘాన్ని కష్టాలపాలు చేయకుండా ఉండేందుకు జాగ్రత్తగా ప్రవర్తించాలి. ఈ విధంగా తన ప్రవర్తనను అలవరుచుకొనేందుకు, నడవడికను చక్కదిద్దుకొనేందుకు కొన్ని విషయాలు లోకం నుంచి, తన జీవితానుభవాల నుంచి, తనకు ముందు జీవించిన వారి అనుభవాల నుంచి కొంత కొంత నేర్చుకోవాల్సి ఉంటుంది. పసివాడు నడక నేర్చుకొంటున్నట్లుగా జీవితంలో కూడా చక్కగా నడవటానికి కొంత ఆసరా కావల్సి ఉంటుంది. మాటలు నేర్చుకొన్నట్లే సంఘం నుంచీ, తను చూసిన, విన్న, చదివిన జీవిత సన్నివేశాల నుంచి వ్యక్తి తన సంస్కారాన్ని సమకూర్చుకుంటాడు. మానవ జీవితంలో ప్రధానమైన సన్నివేశాలు సార్వకాలికమైనవి కాబట్టి; సమస్యలు, అనుభవాలు చాలవరకు ఒకే రకంగా ఉంటవి కాబట్టి, సముదాయ జీవనం నుంచి మంచి చెడ్డలను, సమస్యలు ఎదురైనప్పుడు వాటిని ఎట్లా ఎదుర్కోవాలి, వాటి నుంచి ఎట్లా బయటపడాలి మొదలైన విషయాలను మానవుడు చూసి, విని, చదివి, తన జీవితానికి వర్తింప చేసుకొని సత్ఫలితాన్ని సాధించగలడు. మానవుడు తినే ఆహారంవల్ల శరీరానికి కావలసిన పోషణను, జీవశక్తిని సంపాదించుకొన్నట్లే, చదివే పుస్తకాలవల్ల, తెలుసుకొనే సంగతులవల్ల, మెలిగే సమాజంవల్ల కొన్ని విలువలను, నడవడిని, దృక్పథాన్ని ఏర్పరచుకుంటాడు. పదిహేను ఇరవై సంవత్సరాలు వచ్చేదాకా తల్లీ తండ్రీ, తనకన్నా పెద్దవాళ్ళు ఉంటే తోబుట్టువులు, వీళ్ళవల్ల ఒక వ్యక్తి అలవాట్లు, అభిరుచులు ఏర్పడినట్లే, సమీప బంధువుల, స్నేహితుల నుంచి క్రమంగా తనకు తెలిసినా తెలియకపోయినా తనదైన వ్యక్తిత్వం రూపొందుతూ వచ్చినట్లే, ప్రభావశీలమైన వయస్సున చదివిన పుస్తకాలవల్ల మానవ సంఘంలో ఇతరులతోటి తన సంబంధాలు ఎట్లా ఉండాలో, ఎట్లా ఉంటే సబబో ఆ వ్యక్తి నిర్ణయించుకోగలుగుతాడు. ఇతరమైన కారణాలవల్ల అన్ని వేళల్లోనూ, సమయాల లోను, సందర్భాలలోను, తనకు ఇతరులకు బాధ కలగకుండా ప్రవర్తించటంలో ఎప్పుడైనా కాస్త అవాంతరం సంభవించినా, ఎక్కువ హాని కలగకుండా జాగ్రత్త

పడగలడు, మంచి పుస్తకాలు చదివిన మానవుడు; అసలు ఒక సంస్కారమంటూ అలవర్చుకొంటాడు కాబట్టి.

మానవ జీవితానికి మజిలీవంటి యీ సంఘం ఒక సత్రంవంటిది. వేరే ఊరికి పోయినప్పుడు బస చేయటానికి మనం ఒక సత్రంలోనో, హోటలు గది లోనో దిగినప్పుడు, మళ్ళీ అక్కడి నుంచి ఖాళీచేసి వెళ్ళేటప్పుడు, ఆ సత్రం నిర్వాహకుడికి కాని, హోటల్ యజమానికి కాని కష్టమూ నష్టమూ కలిగించ కుండా ఉండటం కనీస ధర్మం కదా! అంతేకాదు, మన బసను కశ్మలంగానూ, మురికిగాను, అసహ్యంగానూ వదిలి ఖాళీ చేయకూడదు. ఎంగిలిమంగలంగాను, దుర్వాసనలతోను, ఆ గదిని మనం వదిలి వెళ్ళితే, అటు తర్వాత అందులో బస చేయవలసినవాళ్ళు ఎంతో కష్టపడతారు. గాజు పెంకులు, బ్లేడు ముక్కలు లాంటివి నిర్లక్ష్యంగా వదిలిపోతే ఆ గదిలో మనం వెళ్ళిన తర్వాత బస చేసిన కుటుంబంలో చిన్న పిల్లలుంటే వాళ్ళను కాళ్ళకో వేళ్ళకో ఆ గాజు ముక్కలు బ్లేడు ముక్కలు ఆపద కూడా కలిగించవచ్చు. అందువల్లనే ప్రతిరోజూ సత్రం సిబ్బంది గాని, హోటలు పనివాళ్ళుగాని ఆ గదుల శుభ్రతను పట్టించుకుంటూ ఉంటారు. మంచి పుస్తకాలు చేసే పనికూడా ఇటువంటిదే.

మంచి పుస్తకాలు చదవటంవల్ల మనస్సు వికసిస్తుంది. తోటి మానవుల తోటి మెలగవలసిన వైనం తెలుస్తుంది. తోటి మానవుల కష్టసుఖాలపట్ల సాను భూతి, సహానుభూతి పెంపొందుతాయి. ఇతరుల సుఖాన్ని చూసి తాను సంతో షించటం, ఇతరుల దుఃఖంతో తాను పాలుపంచుకోవటానికి మనసుని సిద్ధం చేయటం జరుగుతుంది.

స్వీయచరిత్ర అనేది ఒక వ్యక్తి యథార్థ జీవితానికి సంబంధించిన రచన కాబట్టి, మానవ జీవితానుభవం నుంచి జీవిత సత్యాలను తెలుసుకోవాలనుకొనే వాళ్ళకు ఇవి మరింతగా ఉపయోగిస్తాయి. ఒక పని చేయటానికి కావలసిన పని ముట్లలో నాణ్యతగల పనిముట్లవంటివన్నమాట ఇవి.

అసలు స్వీయచరిత్రను ఎవరైనా ఎందుకు వ్రాస్తారు? కొందరు లోకంలో దానధర్మాలు చేస్తారు, పాఠశాలలు నిర్మిస్తారు, ఆస్పత్రుల కోసం డబ్బు ఇస్తారు. రోగులకు సేవ చేస్తారు. దేవాలయాలు కట్టిస్తారు. ఇవన్నీ ఎందుకు చేస్తారు? సంఘంలో జీవిస్తున్న మానవుడికి సహాయం చెయ్యటానికే కదా! మేలు కలగ

టానికే కదా! తాము ఈ లోకంనుంచి వెళ్ళిపోయిన తర్వాతకూడా సంఘానికి తాము తలపెట్టిన ఉపకారాలు తరతరాలు సాగాలని తమ శాయశక్తులా, తమకు తోచిన విధంగా కట్టుదిట్టాలు చేస్తారు. అటు తరవాత తరాలవాళ్ళు వాళ్ళను తలచుకొన్నా తలుచుకోకపోయినా, అందువల్ల ఉపకారాన్ని మాత్రం పొందుతూనే ఉంటారు.

కాకినాడ దగ్గర ఒక పల్లెటూళ్ళో మల్లాది సత్యలింగనాయకర్ అనే ధనవంతులుండేవారు, మూడు నాలుగు తరాల క్రిందట. ఆయన చాలా చిన్నతనంలో చాలా బీదవాడుగా ఉన్న రోజుల్లో ఓడ కళాసీగా జీవికను మొదలుపెట్టి ఎన్నో ఓడలకు యజమాని అయినాడు. బర్మా మొదలైన ప్రదేశాలకు ఓడలు నడిపి చాలా డబ్బు సంపాదించాడు. అయితే ఆయన తాను చిన్నతనంలో చదువుకోలేదే, చదువు వచ్చిఉంటే ఎంత బావుండేది అన్న తపనతో పాఠశాలలు స్థాపించటానికి, పాఠశాలల్లో చదువుకొనే బీద విద్యార్థులు ఆ చదువు ఆగకుండా సాగించటానికీ చాలా డబ్బు దానంగా ఇచ్చి, తన తర్వాత కూడా తన దానధర్మాల నిర్వాహకులు తన కోరిన విధంగా తన డబ్బు వినియోగించే ఏర్పాటు చేశాడు. ఆ విధంగా ఆయన ఏర్పాటు చేసిన ఉపకారవేతనం పొందిన విద్యార్థులలో ఒకరు అటు తర్వాత స్వతంత్ర భారతదేశపు రిజర్వు బాంక్‌కు గవర్నరు కాగలిగాడు. ఇంకెందరో గొప్ప గొప్ప స్థాయిలకు ఎదగగలిగారు!

ఒక మర్రిచెట్టు ఎన్నో వేల పక్షులకు గూళ్ళనిస్తుంది. బాటసారులకు నీడనిస్తుంది. ఒక చెరువు పంటపొలాలకు నీటి నిస్తుంది. తరతరాల గ్రామ ప్రజలకు దప్పితీరుస్తుంది. లోకంలో దానధర్మాలు చేసే వ్యక్తులు కూడా మహావృక్షాల వంటి వారు. నీటి వనరుల వంటి వారు.

కె.ఎన్. కేసరి అన్న పేరు గల ఒక మందుల వ్యాపారి ముప్పై నలభై ఏళ్ళ కిందటి వరకు మద్రాసులో జీవించి ఉండేవారు. ఆయనది ఒంగోలు దగ్గర చిన్న పల్లెటూరు. చిన్నతనంలోనే తండ్రి చనిపోవటంవల్ల, ఆదుకొనే బంధు బలగం ఎవ్వరూ లేకపోవటంవల్ల చేతినిండా ముద్దచేసి తినటానికి కూడా లేని పరిస్థితిని, లేమిని ఆయన చిన్నతనాన అనుభవించవలసి వచ్చింది. తల్లికి ఒక్కగా నొక్క కొడుకు. ఆ పిల్లవాడికి కడుపునిండా అన్నం పెట్టుకొనే అదృష్టం కూడా తనకు లేదు. తొమ్మిది పదేళ్ళు వచ్చిన తర్వాత చుట్టుపక్కల దగ్గరవగ్గర పల్లెటూళ్ళకు వెళ్ళి, పెట్టగలిగిన వారి దగ్గర ఆ యా ధాన్యాలు

యాయవారంచేసి తెచ్చేవాడు పిల్లవాడు. తల్లిని చాలా సంతోష పెడదామని పిల్లవాడు చాలా ఎండపొద్దు ఎక్కేవరకూ ఇంకా రెండు మూడు ఊళ్ళు కూడా ఎక్కువ తిరిగి, రకరకాల ధాన్యపు మూటలు ఒకటిగా కట్టి, మోయలేని బరువుతో రెండు జాములవేళ ఇంటికి తెచ్చాడు. అమ్మ ఎంతో ఆనందపడుతుంది అను కున్నాడు అమాయకుడు. అమ్మ పొయిలో పిల్లిని లేపుతుండగానే అలసి అలసి తిరిగి తిరిగి ఎండలోపడి వచ్చిన పిల్లవాడికి ఆపలేని నిద్రవచ్చింది. సొమ్మసిల్లి నట్లు నిద్రపోయినాడు. కాసేపటికి నిద్ర మెలుకువ రాగా చూస్తే తల్లి తన కాళ్ళ దగ్గర కూచుని కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నది. ఆ పిల్లవాడికి అమ్మ ఎందుకు కన్నీళ్ళు పెట్టుకుంటున్నదీ తెలియలేదు. ఆ పిల్లవాడి కాళ్ళనిండా పల్లేరు ముళ్ళు విరిగి ఉన్నాయి. అవి చూసి ఆ తల్లి కడుపు చెరువైంది. ఇవాళ చాలా పెద్ద మూట తెచ్చాను అన్నాడు పిల్లవాడు. ఆమె కళ్ళు కాల్వలైనాయి. నాయనా, ఇక నీవు యీ విధంగా యాచనకు వెళ్ళవద్దు అని ఆమె బావురుమంది. ఆ పిల్లవాడు ఆలోచించాడు. ఒంగోలు నుంచి మద్రాసుకు కాలినడకన ప్రయాణమైనాడు. మద్రాసు నగరంలో వీధి కొళాయిల దగ్గర మంచినీళ్ళూ, ఎవరైనా కానీ, అర్ధణా ఇస్తే దానితో ఏదైనా కొనుక్కొని కడుపు నింపుకోవటం, కొన్నాళ్ళు సాగింది. తర్వాత ఒక మందులు తయారుచేసే కంపెనీలో కల్వంలో మందులు నూరే బాలుడిగా కుదురుకుని, తీరికవేళల్లో పాఠశాలల్లో చదువుకుని పెద్దవాడై నాడు. ఆయనే స్వయంగా తరవాత మందులు తయారుచేశాడు. చాలా ధనవం తుడైనాడు. కేసరి కుటీరం అనే మందులు తయారుచేసే సంస్థను స్థాపించాడు. ఉన్నత పాఠశాలను నిర్మించాడు. గృహలక్ష్మి పత్రికను నిర్వహించాడు. రచ యిత్రులకు స్వర్ణకంకణం బహుమతులు ఏర్పాటు చేశాడు. ఈ మహనీయుడు స్వీయచరిత్ర ప్రకటించాడు. ఆ స్వీయచరిత్ర పేరు 'నా చిన్ననాటి ముచ్చట్లు.'

ఒక సత్యలింగనాయకర్, ఒక కోట నరకేసరి మానవత్వాన్ని మంచి గంధంతో పరిమళింపచేయలేదా? వాళ్ళు దివ్యమానవులు కాదా? వాళ్ళను మానవ దివ్యు లనరాదా? మానవుడు తన జీవితాన్ని సార్థకమూ, చరితార్థమూ చేసుకో గల మార్గాలు వాళ్ళు చూపలేదా?

స్వయంకృషితో, నిజాయితీతో, నీతివర్తనతో మానవుడు లోకాన్ని మరామతు చేయగలడు. విలువలేని జీవితాలకు చెలువం ప్రసాదించగలడు.

అయితే సంఘానికి యీ మానవత్వపు విలువలు నిరంతరం బోధ చేస్తూ ఉండవలసిందే. తనకు కడుపునింపే చెయ్యి ఏదో పసివాడు గుర్తుపెట్టుకుంటాడు కాని, పెరిగిన పెద్దవాడు మరచిపోతాడు. తోటలో పూసిన పువ్వుల అందాన్ని చూసి ముచ్చటపడతామేకాని తోటమాలి పడ్డ శ్రమను అంచనా వెయ్యలేము. జ్ఞాపకం చేసుకోనూలేము.

మహితాత్ముడైన వ్యక్తి పూలతోటవంటివాడు. దాని తోటమాలివంటివాడు.

మానవ సంఘం ఒక పంట పొలంవంటిది. విత్తనాలు చల్లిన దగ్గరనుంచీ పంట ఇంటికి చేర్చుకొనేదాకా జాగ్రత్త పడవలసిందే. చీడపీడలు, పశువుల బెడద, క్రిమికీటకాలు, చౌటు, బీడు పడటం ఇవి లేకుండా చూసుకోవాలి. అప్పుడే రైతు శ్రమకు ఫలితం. రైతువంటివాడు రచయిత. రైతు పంట పొలాన్ని రక్షించుకున్నట్లు రచయిత సంఘాన్ని సంరక్షించుకుంటాడు. మహనీయుల స్వీయ చరిత్రలనుంచి పాఠకుడు తెలుసుకోవల్సింది ఇదే. తుమ్మల సీతారామ మూర్తి చౌదరి ఈ కాలపు గొప్ప కవి. ఆయన చెప్పిన దృష్టాంతం చాలా గొప్పది. ఎంత బీదవాడైనా, పనికిమాలినవాడైనా, రైతు విత్తనాలు పాడు చేసుకోడు, ఆహారించడు అని ఆయన అన్నారు. సమాజానికి కూడా ఇది వర్తిస్తుంది. ఆవర్తిస్తుంది. సాహిత్యమే సంఘానికి యీ స్ఫూర్తి నిస్తుంది. ఈ దృష్టితో చూస్తే సాహిత్యప్రక్రియలలో స్వీయచరిత్రకు మరింత ప్రాధాన్యం ఉన్న సంగతి వెల్లడవుతుంది. వ్యక్తి జీవితంలో మాదిరిగానే సంఘ జీవితంలో కూడా వొడిదుడుకులు వస్తూ ఉంటాయి. అప్పుడాసంఘాన్ని కొందరు మేధావులు, మహనీయులు, పెద్దలు చక్కదిద్దుతారు. ఇది సమాజచరిత్రలో నిరంతరం జరుగుతూ ఉండేదే, జరగవలసిందే. మత నైతిక సాంఘిక రాజకీయరంగాలలో విశిష్టులైనవారి సేవా కృషివల్లనే సంఘంలో నాగరికత అభివృద్ధి చెందుతూ ఉంటుంది. ఉదాహరణకు వీరేశలింగంపంతులుగారి వ్యక్తిత్వాన్ని పరిశీలించ వచ్చు. ఆయన సాగించిన సంఘ సంస్కరణానికి ముందున్న ఆంధ్రదేశమూ, అటుతర్వాత ఆంధ్రదేశమూ పోల్చి చూసేట్లయితే, ఆయన ఎంత భావ పరివర్తనం తెచ్చాడో బోధపడుతుంది. అనేక రంగాలలో దేశంలోని ప్రజలలో యీ భావ పరివర్తనం రావటానికి ఆయన కృషి చేశారు.

వీరేశలింగం మానవ సమాజాన్ని గురించి ఒక మాట వ్రాశారు. అనాది కాలంనుంచి మానవ సమాజం ఎన్నోవిధాలుగా అభివృద్ధి చెందుతూ ఉన్నది.

మానవుడి నాగరకత యుగాయుగాలుగా వృద్ధిచెందుతూ వస్తున్నది. ఆ ప్రయత్నం మానవుడు నిర్విరామంగా చేస్తూనే ఉన్నాడు. పశుపక్ష్యాదుల జీవనవిధానం అట్లా కాదు. వెయ్యేళ్ళక్రిందట పక్షులు యెట్లా గూళ్ళు కట్టుకుంటూ ఉండేవో ఇప్పుడూ అట్లానే గూళ్ళు కట్టుకుంటూ ఉంటాయి. పశువుల జీవనాధానంలో కూడా ఎక్కువ మార్పులేదు. మానవజీవితంమటుకు అట్లాకాదు. అనేకమైన అన్వేషణలు జరిపి కొత్తకొత్త వాసభూములను గవేషిస్తూ ప్రకృతిపైన కూడా ఆధిపత్యం సంపాదించుకుంటూ, స్థల, జల, వాయువులను కూడా వశంచేసుకుంటూ పురోగమిస్తున్నాడు. వ్యవసాయ పరిస్థితులలో యంత్ర నాగరకతను వృద్ధి చేసుకోవటంలో ఎన్నెన్నో కొత్తవి సృష్టించాడు. మానవ జీవితానికి సౌకర్యాలు ఏర్పాటు చేసుకుంటున్నాడు. ఆర్థిక రాజకీయ మత నైతిక సమాజిక వ్యవస్థలలో అప్పటప్పటి అనుభవాలనుబట్టి కొత్తకొత్త మార్పులు, పునర్వ్యవస్థీకరణం చేసుకుంటూ వచ్చాడు. సమాజంలో సంఘర్షణలు లేకుండా ఒక కట్టుబాటు ప్రకారం నడచుకోవటానికి నియమాలు ఏర్పరచుకొన్నాడు. అటువంటి నియమాలు కొత్త పరిస్థితులకు అనుగుణంగా లేకపోతే వాటిని మార్చుకోకతప్పదు అని వీరేశలింగం స్వీయ చరిత్రలో బోధించాడు.

నూరేళ్ళ కిందట ఏర్పడ్డ రథ్యలను మహానగరంలో వెడల్పు చేసుకోవల్సిన అగత్య మున్నట్లే, సమకాలీనమైన రవాణా సమస్యలు, జనసమ్మర్దం, చారిత్రక కారణాలవల్ల, ఆర్థిక రాజకీయ హేతువులవల్ల, సమాజ కార్యకలాపాల కేంద్రీకరణంవల్ల, ఎప్పుడో ఏర్పాటు చేసుకొన్న నగర వీథులు ప్రజల రాకపోకలకు అనుగుణంగా ఉండవు. అందువల్ల వాటిని వెడల్పు చేసుకోవటం జరుగుతుంది. సాంఘిక సామాజిక రాజకీయ ఆర్థిక వ్యవస్థలు కూడా అటువంటివే. అయితే వాహనాల, ప్రజల రాకపోకలకు ఆటంకాలు లేని వీథులు అవసరమైనట్టే సమర్థాన్ని అదుపులో పెట్టే ఏర్పాట్లు ఉండవలసి ఉన్నట్లే సామాజిక వ్యవస్థ కూడా ఉండాలి. వ్యవస్థను మేరమీరితే సామాన్యుడు నష్టపోయినట్లు బలవంతుడు, ధనవంతుడు నష్టపోడు. రోడ్డు ప్రమాదాలలో సాధారణంగా అసువులు పోగొట్టుకొనేది పాదచారులు, చిన్నచిన్న యాన వాహనాల వాళ్ళూనూ. అంతేకాని పెద్ద శకటాల వాళ్ళూ, సంపన్న స్థితిని సూచించే వాహనపరులు అట్టే ప్రమాదాలకు గురికారు. అందువల్ల వ్యవస్థను బలవంతుడు, ధనవంతుడు ఎదిరించినా సామాన్యుడు విరోధించకూడదు. ఆయా కాలాలలో, ఆయా

పరిస్థితులలో మానవ సమాజ ఉత్థాన పతనాలను ప్రత్యక్షసాక్షికంగా వివరించేవి స్వీయచరిత్రలు. కాబట్టి వీటికి దేశచరిత్ర రచన కుపకరించే సాధన సామగ్రులలో విశిష్టమైన, అత్యంత ప్రధానమైన స్థాన ముంటుంది. దేశచరిత్ర రచించటానికి ఆయా రంగాలలో కృషి చేసిన మహనీయుల స్వీయచరిత్రలు ముడి పదార్థం వంటివి. దేశ చరిత్ర పరిణామాన్ని సూచించగల ఆకరాలుగా అవి పనికి వస్తాయి.

భారతదేశంలో ప్రాచీన కాలంలో చరిత్ర రచనకు అంత ప్రాధాన్యం కనపడదు. దేశచరిత్రను, సమాజ చరిత్రను కూడా ప్రాస్తావికంగా సాహిత్య ఆధారాలనుంచే తెలుసుకోవల్సి ఉంటుంది. వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు, భవభూతి, భోజరాజు, చంద్రగుప్తుడు, విక్రమాదిత్యుడు, శ్రీహర్షుడు, రాజనరేంద్రుడు, శ్రీకృష్ణదేవరాయలు, నన్నయ్య, తిక్కన- వీరి జీవితచరిత్రలను తెలుసుకొనే అవకాశం లేదు. కావ్యావతారికలలో సంగ్రహంగా ప్రసక్తమైన విషయాలను బట్టి, శాసనాల ఆధారాల నుంచి, కావ్యాలలో అంకితం పొందిన రాజుల జయప్రశంసలను బట్టి, ఆయా కవులను గురించి, రాజులను గురించి, వారి కాలాన్ని గురించి, వారేలిన రాజ్యాన్ని గురించి కొంత కొంత తెలుసుకొనే అవకాశం ఉంది. కావ్యావతారికలలో కవులు చేసుకొనే స్వీయ వంశాభివర్ణనం కొంతవరకు అతి సంక్షిప్తంగా స్వీయచరిత్ర చెప్పటమే.

అయితే 19, 20 శతాబ్దుల భారతదేశ చరిత్రలో ఖండాతర ప్రజా జీవన సరళితో సంబంధం ఏర్పడటంవల్ల, ఇంగ్లీషు వారి సాంఘిక జీవన పద్ధతులు, సాహిత్య రీతులు ఆధునిక భారతీయ భాషా సాహిత్యాలను ప్రభావితం చేయటంవల్ల, భారతీయ భాషలలో, సాహిత్యాలలో, సాంఘిక జీవన పద్ధతులలో, సామాజికాదర్శాలలో నవీనమైన సంప్రదాయాలు ఏర్పడ్డాయి ఈ భావ పరిణామాలను, సాంఘికమైన మార్పులను తెచ్చిన మహనీయుల స్వీయచరిత్రలు అటు తరవాత తరాల వాళ్ళకు ఎంతో ఆకర్షకంగా ఉంటాయి. జీవితానుభవాలను ఒక వ్యక్తి స్వయంగా చెప్పటంవల్ల ఈ ఆకర్షణ మరింత అధికమవుతుంది. స్వీయ చరిత్రలు పూర్వకాలపు శిలా తామ్రశాసనాల వంటివి ఇవి ఆయా కాలాల సామాజిక చరిత్రను పునర్నిర్మించటానికి ప్రత్యక్షమైన, విశ్వసనీయమైన ప్రాథమిక శ్రేణి ఆధారాలు.

# 2. స్వీయ చరిత్రలు ఎందుకు వ్రాస్తారు ?

ఎవరైనా స్వీయ చరిత్రను ఎందుకు వ్రాస్తారు అనే ప్రశ్న ఉదయించి నప్పుడు వేరువేరు కారణాలతో ఇందుకు ఆయా వ్యక్తులు పూనుకుంటారనిపిస్తుంది. జీవితంలో ఏదో మహత్తరమైన ఆశయ సాధనకు పరిక్రమించినవారే సాధారణంగా తమ అనుభవాలను తోటివారికి తెలియబరచాలని ఉత్సహిస్తారు. అదొక ఆత్మతృప్తి. ఒకరకమైన సమాశ్వాసం. జీవిత సింహావలోకనం. ఏం సాధించాము, ఎటువంటి అపార్థాలకు గురైనాము, ఎటువంటి అడ్డంకులను అధిగమించాము అని తీరుబాటుగా పునరవలోకనం జరిపినప్పుడు ఆయా విషయాలు, చిర పరిచితమైనవి కూడా ఆత్మోద్దీపకంగా, అద్భుతావహంగా, ఉద్వేగకరంగా తమకే తోచవచ్చు. వీటిని మిత్రులతో, ఆత్మీయులతో, సమకాలికులతో, అనంతరకాలికులతో భావ వినిమయం చేసుకుందామని మనసు సందడించవచ్చు తరవాత సంఘంలో తోటివారి బాగు కోసం శ్రమించిన మహనీయులు నిండు ఆధ్యాత్మిక దృక్పథం కలవారైతే, పరమ ఆస్తికులైతే, తమ జీవిత కార్యకలాపమంతా ఈశ్వర ప్రీతికరంగా సాగించిందే తప్ప, పలికెడిది, పలికించెడు వాడిది తప్ప తనదికాదని ఒక స్వాత్మార్పణ బుద్ధి, అది కేవలం హృదయంలో నివిష్టమై ఉంటే చాలదు, అక్షరంగా వ్యక్తీకరించాలనే కోరిక స్వీయ చరిత్ర రచనకు ప్రేరేపిస్తుంది. సామాన్య కుటుంబీకుడు కూడా తా నార్జించిన సొత్తు విషయమై కుటుంబంలో కలహాలు, కార్పణ్యాలు రాకుండా, కనీసం రాకూడదన్న కోరికతోనైనా వీలునామా వ్రాస్తాడు. అటువంటిది జీవిత కాలమంతా ఒక పరమాశయ సాధనకు ఉద్యమించిన ఒక మహా వ్యక్తి తనను ప్రేరేచిన శక్తు లేమిటో, తాను సాధించిందేమిటో, అది లోకానికి ఏ విధంగా ఉపయోగకరమని తాను భావించాడో చెప్పటానికి ఉత్సుకుడు కావటంలో అసహజత ఏమీ లేదు. ముఖ్యంగా యీ విషయం సామాజిక సంస్కరణల వీరోచిత పోరాటాలు నడిపినవారికి వర్తిస్తుంది.

స్వీయ చరిత్ర అనే సాహిత్య ప్రక్రియ స్వరూప స్వభావాలను, ప్రమాణాలను, సాహిత్య ప్రయోజనాన్ని విశ్లేషించిన విజ్ఞాన సర్వస్వాలు యీ స్వీయ

చరిత్రను నాలుగు శాఖల క్రింద విభజించారు. విషయాత్మకం, ఆధ్యాత్మికం, మేధావికం, కల్పనాత్మకం అని. ఇంగ్లండులోనూ అమెరికాలోను ఇతర యూరోపు దేశాలలోను నాలుగైదు వందల యేండ్లుగా వచ్చిన స్వీయ చరిత్రలను విశ్లేషించి, అనుశీలించి యీ విషయ విభాగ వినిర్ణయం చేశారు. తన సమాజాన్ని, వ్యక్తిగతమైన, కౌటుంబికమైన జీవితాన్ని ఆనుపూర్వి సంఘటనాత్మకంగా వర్ణించుకుంటూ తన జీవిత చరిత్రను రచించటం మొదటి విభాగంలోకి వస్తుంది. ఆధ్యాత్మిక గవేషణతో మత సాంస్కృతికోద్యమాలకు పూర్తిగా తమను తాము అర్పించుకొన్న వారి సంచలన జీవితం ఆధ్యాత్మిక విభాగంలో చేరుతుంది. అధ్యాత్మికానుభవాలు, ఉద్యమాలు, సమాజోద్బోధం, నిర్మాణాత్మక కృషి, స్వీయ జీవితంలో ప్రధాన స్థానమాక్రమించిన చరిత్ర అయితే అది రెండవ విభాగంలోకి చేరుతుంది. తెలుగులో స్వామి జ్ఞానానంద స్వీయ చరిత్ర, మునిపల్లె స్వామి వారి స్వీయ చరిత్ర మొదలైనవి యీ కోవలోకి వస్తాయి. ఇక మూడో విభాగం మేధావికం అనేది. సమాజంలో వివిధరంగాలలో శేముషీదురంధురులైనవారు స్వీయ జీవితానుభవాలు, ప్రత్యేకమైన ఒక విజ్ఞానరంగానికో, కళారంగానికో, శాస్త్రానికో తమను తాము అర్పించుకొన్నకృషి, వీటికి సంబంధించిన స్వీయ చరిత్ర యీ విభాగంలోకి చేరుతుంది. తెలుగులో రాయకపోయినా డా. కె. ఎల్. రావుగారి 'క్యూసెక్స్ కేండిడేట్' అనే స్వీయ చరిత్ర ఇటువంటిదని చెప్పాలి. కోటంరాజు రామారావు, కుందూరి ఈశ్వరదత్తులు అఖిల భారత స్థాయిగల గొప్ప పాత్రికేయులు. వాళ్ళు తెలుగులో రాయకపోయినా ఇంగ్లీషులో స్వీయచరిత్రలు ప్రకటించారు. 'పెన్ యీజ్ మై స్వోర్డ్' (కలమే నా ఖడ్గం), స్ట్రీట్ ఆఫ్ ఇంక్ (మషీపథం లేదా సిరావీధి అనవచ్చేమో,) వాళ్ళ స్వీయ చరిత్రలపేర్లు. సంజీవ్ దేవ్ స్మృతి బింబాలు, గతంలోకి మొదలైన అనుభవాలు జ్ఞాపకాలు మేధావి స్వీయ చరిత్ర వర్గంలోనే చేర్చవచ్చు. ఇటీవలే వెలువడ్డ మామిడిపూడి వెంకటరంగయ్య గారి "మారుతున్న సమాజం - నా అనుభవాలు" కూడా మేధావుల స్వీయ చరిత్రల్లోనే చేర్చాల్సిఉంటుంది. నాలుగో విభాగం కల్పనాత్మకం అని. స్వీయ చరిత్ర అనేది వాస్తవ జీవితానికి సంబధించింది కదా, ఇందులో సృజనాత్మకతకు, కల్పనాత్మకతకు అవకాశం ఎట్లా ఉంటుందన్న ప్రశ్న తలయెత్తవచ్చు. అంటే నవల రూపంలో, నవల శిల్పంతో స్వీయ జీవితానుభవాలను మల

చట మన్న మాట. లేదూ వాస్తవ జీవితాన్ని నవలగా రాయటం. కావల్సిన బల మైన సన్నివేశాలను నవలగా రాసినట్లు ఉపయుక్తం చేయటం. ఈ విభాగం స్వీయ చరిత్రలలో పూర్తిగా స్వీయ చరిత్ర ఉండదు. కాని, స్వీయచరిత్రను ఆధారం చేసుకొని ఆ నవలలు వ్రాయటం జరుగుతుంది. తెలుగులో కొడవటి గంటి కుటుంబరావు 'చదువు' అనే నవల యీ కోవకు చెందింది. విశ్వనాథ సత్యనారాయణ, అడవిబాపి రాజుగారి నవలల్లో యీ యీ పాత్రలు వారి సమ కాలిక జీవితంలో వీరి వీరి ప్రతిబింబాలు అంటూ కొంత గుర్తించటం జరిగింది. ఆ మాటకు వస్తే గుప్తంగానో సుప్తంగానో, అవిదితతంగానో అనూదితంగానో సృజనాత్మక సాహిత్యంలో రచయిత వాస్తవిక జీవిత అనుభవాలు తప్పనిసరిగా ప్రతిబింబిత మవుతాయి. రచయిత సామాజిక జీవితానుభవానికి కొంత కాల్పని కత, సృజనాత్మకప్రతిభ కూడి అది ఒక రసాయన ప్రక్రియగా రూపొంది కల్పనా సాహిత్యం రూపుదిద్దుకొంటుంది. బుచ్చిబాబు తన ఆత్మకథను 'అంతరంగకథనం' పేరుతో చెప్పుకున్నాడు. సోమర్‌సెట్ మామ్ స్వీయ జీవితానుభవాలు 'ది సమ్మింగ్ అప్' పేరిట వెలువరించాడు. బుచ్చిబాబు అంతరంగ కథనం తెలుగులో స్వీయ చారిత్రక సాహిత్యంలో చాలా విలువైనది.

శిల్పాన్ని, ఇతివృత్తాన్ని, రచనా విధానాన్నిబట్టి స్వీయ చరిత్ర నాలుగు విభాగాలుగా ఉపలక్షిత మవుతే, స్వరూప స్వభావాన్ని బట్టి, ప్రధానమైన విభాగాలు రెండు పేర్కొనవచ్చు. ఒకటి స్థూలాకృతికం, రెండోది నియత ఆకృతికం అని. వీటినే స్వీయ చరిత్రాత్మకమనీ, పూర్తిగా స్వీయ చరిత్రమనీ స్పష్టీకరించవచ్చు. స్మృతులు, జ్ఞాపకాలు, జీవిత ఘట్టాలు, యాత్రా వృత్తాంతాలు దిన చర్యలు, లేఖలు ఇవన్నీ స్వీయ చరిత్రాత్మక సాహిత్యం కిందకి వస్తవి. ఆత్మకథ, స్వీయ చరిత్రం పేరుతో జననం, బాల్యం, జీవితంలో వివిధ సన్నివేశాలు, వృత్తి, ఉద్యోగం, వివిధరంగాలలో చేసినకృషి మొదలైనవి వర్ణిత మవుతూ జీవిత గాధాత్మకంగా సాగితే అది నిర్దిష్టమైన ఆకృతిని ఏర్పరుచుకొని స్వీయ చరిత్రగా పరిగణించబడుతుంది. గురజాడ అప్పారావు, వీరేశలింగం డైరీలు స్వీయ చరిత్రాత్మక సాహిత్యం విభాగంలో చేరుతాయి ఇదే విధంగా చలం లేఖలు, గొర్రెపాటి వెంకట సుబ్బయ్య గారి లేఖలు కూడా స్వీయ చారిత్రాత్మక సాహిత్యమే. యేనుగుల వీరాస్వామయ్య యాత్రాచరిత్ర కూడా స్వీయ చరిత్రాత్మక సాహిత్యం క్రిందనే పరిగణించవచ్చు.

పాశ్చాత్య దేశాలలో కూడా 15, 16 శతాబ్దులలో పునరుజ్జీవనోద్యమ కాలంలోనే స్వీయ చరిత్రావిర్భావం జరిగిందని సాహిత్య చరిత్రవేత్తలు భావిస్తున్నారు. అక్కడ ఆ దేశాలలో సాహిత్య గౌరవాన్ని పొందిన లేఖా వాఙ్మయం కూడా సృష్టించబడింది. ఇరవైయ్యో శతాబ్దంలో వెలువడిన ఇటువంటి లేఖా వాఙ్మయం సృజనాత్మక సాహిత్య గౌరవాన్ని పొందింది పాశ్చాత్య దేశాలలో. అనీ ఫ్రాంక్ అనే యూదు యువతి వ్రాసిన లేఖా సాహిత్యం నాటకంగాను, సినీమాగానూ కూడా పరివర్తితమయిందంటే, కాల్పనిక సాహిత్యంకన్నా కూడా ఆ లేఖలు ఎంత ఆకర్షణను సాధించాయో తెలుసుకోవచ్చు.

పాశ్చాత్య దేశాలలో స్వీయచరిత్రలు కొన్ని కావ్యరూపంలో కూడా వెలువడటం గమనించవచ్చు. సుప్రసిద్ధ కవులు వర్డ్స్‌వర్త్, బైరన్‌లు ఆత్మచరిత్రలు కృతించారు. పాశ్చాత్య దేశాలలో యీ ప్రక్రియ చాలాకాలం మెమొయిర్స్, రెమినిసెన్సెస్, జర్నల్ అనే సంభావితమవుతూ వచ్చింది. 18 వ శతాబ్ది చివర కాని 'ఆటో బయాగ్రఫీ' అనే పేరు యీ ప్రక్రియకు నిర్ణయం కాలేదు. 'మంత్లీ రివ్యూ' అనే సాహిత్య పత్రిక యీ ప్రక్రియను 'ఆటోబయాగ్రఫీ' అని సంభావించటంతో అప్పటినుంచి యీ పేరే రూఢమైపోయింది. ప్రపంచ ప్రసిద్ధ చరిత్రవేత్త ఎడ్వర్డ్ గిబ్బన్, విజ్ఞానవేత్త బెంజమిన్ ఫ్రాంక్లిన్, రాజనీతివేత్త రూసోల స్వీయ చరిత్రలు ప్రపంచదేశాల సామాజిక దృక్పథాలను ప్రభావితం చేశాయి. ఇంగ్లండులో ఉదారవాదమనే గొప్ప సామాజిక తత్త్వచింతనను ప్రబుద్ధం చేసిన జాన్ స్టువర్ట్‌మిల్ స్వీయ చరిత్రకు 'ఎడ్యుకేషన్' అని పేరు పెట్టారు. పందొమ్మిదో శతాబ్దంలో ఇంగ్లండులో మహనీయులు ఈ స్వీయచరిత్ర శాఖను ఎంతో పరిపుష్టం చేశారు. సుసంపన్నం చేశారు. లెయిహంట్ (1850), జాన్ స్టువర్ట్‌మిల్ (1883), కార్డినల్ న్యూమన్ (1864)లు వెలువరించిన స్వీయ చరిత్రలు స్వీయ జాతిని ఎంతగానో ప్రభావితం చేశాయి. అమెరికన్ సాహిత్యంలో బెంజమిన్ ఫ్రాంక్లిన్ స్వీయచరిత్ర (1766)కు అత్యంత విశిష్టమైన స్థానమున్నది. రూసో, టాల్‌స్టాయిల రచనలవల్ల గాంధీజీ ఎంతో ప్రభావితులైనారు. రూసో ఆత్మకథ (1782) నిరుపమానమైనది. నివేదనలు (Confessions) పేరున ఆయన స్వీయచరిత్ర రచించాడు. సామ్యూయల్ బట్లర్, జేమ్స్ జాయిస్, జార్జ్ సాంటాయనల నవలలు స్వీయ చరిత్రాత్మకమైన నవలలని విజ్ఞాన సర్వస్వం పేర్కొంటున్నది. 'వే ఆఫ్ ఆల్ ఫ్లెష్' (1903) సామ్యూయల్ బట్లర్ రచించిన

ప్రసిద్ధమైన నవల. జేమ్స్ జాయిస్ ఇంగ్లీషు సాహిత్యంలో చైతన్యస్రవంతి శిల్పాన్ని ప్రవేశపెట్టిన ప్రసిద్ధుడు. 'పోర్ట్రయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాజ్ ఎ యంగ్‌మాన్ (1916) అని జేమ్స్ జాయిస్ వ్రాసిన నవల స్వీయ చరిత్రాత్మక మైనదని బ్రిటానికా విజ్ఞాన సర్వస్వం పేర్కొంటున్నది.

కాబట్టి స్వీయచరిత్ర, అనుభవాలు, జ్ఞాపకాలు, స్మృతులు, గాథలు, దిన చర్య వృత్తాంతాలు, లేఖలు, నవలారూప రచనలు, యీ సాహిత్య ప్రక్రియా కుటుంబంగా భావించవచ్చు.

స్మృతులు, జ్ఞాపకాలు వంటి రచనలలో స్వీయ ప్రాధాన్యంకాక జీవితంలో తారసిల్లిన మహనీయుల వ్యక్తిత్వ చిత్రణకు, అపూర్వ సన్నివేశాలకు యెక్కువ ప్రాధాన్యముంటుంది. ఆయా సన్నివేశాలను రచయిత ఎంత కుతూహలకరంగా చిత్రించాడు అన్నదానిని బట్టి ఆ రచనకు ప్రసిద్ధి వస్తుంది. కేవలం స్వాత్మతృప్తి కోసం, ప్రచురణ నుద్దేశించి కాకుండ, కొందరు స్వీయ జీవిత వృత్తాంతాలు వ్రాయడం కూడా కద్దు.

ఇక కొందరు, భావితరాల వారు తమ వ్యక్తిత్వాన్ని గురించి సరిఅయిన అంచనా కట్టలేక అపార్థం చేసుకుంటారేమోనన్న సందేహంతో కూడా స్వీయ చరిత్రలను వ్రాయవచ్చు వీరేశలింగం స్వీయ చరిత్ర చివరిప్రకరణం చూస్తే సమ కాలికులతో ఆయనకు వచ్చిన అభిప్రాయ భేదాలను, దానికి సంబంధించిన తన దృక్పథాన్ని తెలియచేయటం కూడా ఆయన ఆశయంలాగా కనపడుతుంది. జీవితంలో తాను ఆశించినవీ సాధించినవీ, సాగించిన కృషియొక్క సాఫల్య వైఫల్యాలు బేరీజువేసుకొనే దృష్టితో కూడా కొందరు స్వీయ చరిత్ర వ్రాయవచ్చు. తాము ఎదుర్కొన్న సమస్యలు, అవరోధాలు,వాటి నే విధంగా తాము అధిగమించ గలిగిందీ, ఇతరులకు ప్రోత్సాహకరంగా, మార్గదర్శకంగా ఉంటాయన్న ఉద్దేశంతో కూడా కొందరు స్వీయ చరిత్రకు పూనుకోవచ్చు. హెలెన్ కెల్లర్ 'నా జీవిగాథ' ఇందుకు సరిఅయిన ఉదాహరణ.

ఏది ఏమైనాసాంఘిక జీవితంలో ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉన్నవారే స్వీయ చరిత్ర రచనకు కాని, అనుభవాలు జ్ఞాపకాల గ్రథనానికి కాని పూను కొంటారు. తా మెరిగిన గొప్ప వ్యక్తిత్వాలపట్ల పూజ్యభావంతో, ముందుతరాల వాళ్ళకు యీ విషయాలు చెప్పేవాళ్ళు ఉండరనే ఆలోచనతోనూ కొందరు స్వీయ

చరిత్ర రచనకు పూనుకోవచ్చు. తమ కళ్ళముందే సమాజంలో త్వరిత గతిని అనేకమైన మార్పులు సంభవిస్తుంటే, ఒక తాత్త్వికజిజ్ఞాసతోకూడా తాముచూసిన జీవితాన్ని, ఎరిగున్న వ్యక్తిత్వాలను చిత్రించాలన్న అభిలాష కొందరిలో కలగ వచ్చు. కొందరికి కొన్ని గాఢమైన విశ్వాసాలుంటాయి. దృఢమైన నమ్మకాలుంటాయి. సామాజిక జీవితానికీ మానవ సంబంధాలకూ చెందిన అభిప్రాయాలుంటాయి. వాటిని ఇతరులు కూడా అంగీకరించాలని. ఇతరులు కూడా అందువల్ల ప్రయోజనం పొందాలని ఒక ఉత్సుకత, ఒక ఆశాభావం కొందరికి ఉంటుంది. అందువల్ల వాళ్ళు తమ జీవితానుభవాలు గ్రంథస్థం చేయటానికి పూనుకుంటారు. కొందరు జీవితంలో తమకు తారసిల్లిన వ్యక్తులపట్ల పెంచుకున్న మమతాబంధం వల్లకూడా వాళ్ళజీవితాన్ని ప్రశంసిస్తూ తమ అనుభవాలు వ్రాయవచ్చు. ఆచార్య ఎన్. జి. రంగా తమ ఇల్లాలు భారతీదేవిని గూర్చి ప్రకటించిన 'భారతదేవి స్మృతులు' ఇటువంటి గ్రంథం. దర్శి చెంచయ్యగారి 'నేను-నాదేశం' అనే స్వీయ చరిత్రలో తమజీవితంలో తారసిల్లిన ఎందరో విశిష్టమైన వ్యక్తులను గూర్చి వ్రాశారు. బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారు 'అప్పారావుగారూ - నేనూ' అనే గ్రంథంలో అప్పారావుగారి సున్నిత వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించారు. ప్రతివాది భయంకారాచార్యులుగారు అండమాన్ జీవితంలో తమ వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేసిన మహనీయులను సంస్మరించారు.

కొందరికి తాము చూసిన చారిత్రక విశేషాలను, ఎరిగిన ప్రసిద్ధ వ్యక్తులను, జీవితంలో తారసిల్లిన అపూర్వమైన సంఘటనలను అక్షరబద్ధం చేదామన్నకుతూహలం ఉంటుంది. కొందరికి గడచిపోయిన జీవితం తాలూకు మాధుర్యం, మానవత్వం, ఆయా ప్రదేశాలతో ముడిపడి ఉన్న మమతాబంధం, అక్షరాలా నెమరు వేసుకొనే ఆసక్తి అనుభవాల జ్ఞాపకాల అక్షర రూపానికి తొందరించవచ్చు. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారి 'నా మహారాష్ట్ర యాత్ర'లో ఆయన దర్శించిన ప్రకృతి దృశ్యాలు, సందర్శించిన మహోన్నత వ్యక్తిత్వాలు స్మరించారు. బులుసు వేంకటేశ్వర్లు గారి స్వీయ చరిత్రలో, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి స్వీయ చరిత్రలో వారు చిన్ననాడు జీవితం గడిపిన పల్లెటూళ్ళ శోభ ప్రసక్తమవుతుంది. ముందుముందు తరాల కుటుంబ సభ్యుల నిమిత్తం వంశవృక్షం భద్రపరచినట్లు కొందరు మనవలు, మునిమనవలు తమను గూర్చి, తమ కుటుంబం గూర్చి తెలుసుకోవాలన్న కోర్కెతో తమ జీవిత వృత్తాంతాన్ని వ్రాసి ఉంచుతారు.

తమనుగురించి చెప్పుకోవటమూ, తమనుగురించి వినటమూ జీవితంలో అన్నిటికన్నా అత్యంత ప్రీతిపాత్రమైనవి మాన్యులకూ, సామాన్యులకు కూడా. మానవ జీవితంలో మాదిరిగానే సాంఘిక జీవితంలో కూడా గతాన్ని గూర్చి తర్కించడమూ, తలపోయడమూ, ప్రీతి చూపడమూ సర్వసామాన్యం. మళ్ళీ ఇక దర్శించలేము అనే భావం కూడా గతకాలంవైపు మనసు పరుగులు తీయటానికి కొంత కారణం కావచ్చు. చారిత్రక ప్రసిద్ధిగల పాత్రలను, ప్రదేశాలను, ప్రాముఖ్యం గల ఉద్యమాలను, సంఘటనలను, మలుపులను గూర్చి తెలుసుకోవాలన్న కుతూహలం వర్తమానకాలిక సంఘంలో సర్వసామాన్యం. అట్లానే ఆయా ఉద్యమాలు, సంఘటనలతో ప్రత్యక్ష పరిచయం ఉన్నవారిని వారి సన్నిహితులు, స్నేహితులు, అభిమానులు స్వీయచరిత్ర రచించవలసిందిగా ప్రోత్సాహించటం కద్దు. వాళ్ళకు కూడా ఆ విషయాలు చెప్పాలన్న ఆసక్తి ఉంటుంది. ఉప్పల లక్ష్మణరావుగారి 'బతుకు పుస్తకం' వెలువడకపోతే వీరేశలింగం తర్వాత వచ్చిన భావ పరివర్తనం గూర్చి గాని, స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోని వామ పక్ష ఉద్యమ స్వరూపంగాని, స్వాతంత్రోద్యమ కాలంలో విదేశాలలోని సమకాలీన వ్యవస్థలను గూర్చి గాని తెలుగువాడు తెలుసుకొనే అవకాశం ఉందా?

అందువల్లనే సామాజిక జీవితంలో గణనీయమైన పాత్ర నిర్వహించిన పెద్దలను, విశిష్టమైన కృషి చేసిన వారిని యువకులు కలుసుకొన్నప్పుడు 'మీ స్వీయచరిత్ర ముందుతరాలవారికి ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంటుంది. ఉత్తేజకరంగా ఉంటుంది. ఆ విషయాలు మీరు చెప్పకపోతే ముందుతరాలవారికి తెలిసే అవకాశం కాని, ఇతరులు చెప్పే అవకాశం కాని లేవుకదా' అని అర్థించటం జరుగుతుంది. ఈ విధంగా కొమర్రాజు లక్ష్మణరావు తమను ఎంతగానో నిర్బంధించటం వల్లనే స్వీయచరిత్ర రెండోభాగం త్వరితగతిన తాము పూర్తిచేశామని వీరేశలింగం స్వీయచరిత్ర అవతారికలో ప్రస్తావించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిని రాయసం వెంకటశివుడు ప్రభృతులు ఎంతగానో ప్రోత్సహించారు. అందువల్ల వీరేశలింగం తర్వాత తెలుగుదేశపు సామాజిక చరిత్ర అంతా చిలకమర్తి స్వీయచరిత్ర ద్వారా గ్రంథస్థమైంది.

దేశకాల పాత్రలలో వచ్చిన మార్పులు, సమాజ రంగాలన్నిటా ఏర్పడిన పరిణామాలు, స్వీయ చరిత్ర ద్వారా విశదంగా తెలిసినట్లు మరే ఇతర సాహిత్య ప్రక్రియల ద్వారా తెలుసుకోలేము. జీవిత చరిత్రకు స్వీయ చరిత్రకు యీ విషయంలో కొంత సాదృశ్యమున్నా జీవిత చరిత్ర రచనాకారుడు తన దృక్కోణం నుంచి చరిత్ర ఘట్టాలను, కథానాయకుడి జీవితాన్నీ వ్యాఖ్యానిస్తాడు. కాని, స్వీయ చరిత్రలో ఇటువంటి వ్యాఖ్యానం కన్నా కథాకథనమూ, వాస్తవ సన్నివేశ ప్రతి

పాదనమూ మాత్రమే ఉంటవి. అందువల్ల ఇవి సమాజ చరిత్రకు మౌలికమైన ఆధారాలుగా ఎక్కువగా ఉపయోగపడతాయి,

స్వీయ చరిత్రలవల్ల ఇంకొక లాభం కూడా ఉన్నది. మేధావులైన వారు తమ సన్నిహిత పరిచయులను, తాము గౌరవించే వ్యక్తుల విశిష్ట గుణగణాలను, తాము మార్గదర్శకంగా ఎంచుకొనే ప్రతిభావంతులను గూర్చి కూడా వ్రాస్తారు కాబట్టి, ఒకవేళ ఆ మహనీయులు స్వీయ చరిత్రలు వ్రాసుకున్నా తమ వ్యక్తిత్వ విశ్లేషణం వారు ప్రసక్తం చెయ్యరు కాబట్టి, సమకాలికుల స్వీయ చరిత్రల ద్వారా ఆ విషయాలు తెలుసుకొనే అవకాశం ఉంటుంది. ఆ విధంగా స్వీయ చరిత్రలు వ్రాసుకోని వాళ్ళ జీవితాలను గురించి కూడా విస్మయావహమైన విషయాలు వారితో సన్నిహిత పరిచయాలు కలవారి ఆత్మ కథలు వెల్లడిచేస్తాయి. అఘోర నాథ చట్టోపాధ్యాయుల గురించి ప్రఫుల్లచంద్ర రే మహాశయుని స్వీయచరిత్రలో ఎన్నో విశేషాలున్నాయి. మోక్షగుండం విశ్వేశ్వరయ్యను గురించి ప్రఫుల్ల చంద్ర రే ఒక ప్రకరణమే స్వీయ చరిత్రలో రచించారు. శ్రీనివాస రామానుజం ప్రపంచ విఖ్యాతుడైన గణితశాస్త్ర విశారదుడు. గొప్ప ప్రజ్ఞాశాలి. ముప్పై ఏళ్ళు కూడా నిండకుండా చిన్న వయస్సున కీర్తిశేషుడైనారు. వీరిని గురించిన విషయాలు తెలుసుకోవటానికి సమకాలికుల, సన్నిహితుల వ్రాతలవల్లనే సాధ్యం. చింతామణి ద్వారకనాథ్ దేశ్‌ముఖ్ స్వీయచరిత్రలో శ్రీ రామానుజం గూర్చిన విశేషాలున్నాయి. రెంటాల వేంకట సుబ్బారావు అఖండ మేధా సంపన్నుడు. బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఆయన చొరవ, ఆత్మ విశ్వాసం, ఉద్యమ శీలం అద్భుతమైనవి. వీరు స్వీయ చరిత్ర వ్రాసి వుంటే తెలుగు వారి ప్రజ్ఞా ప్రాభవాలు ఎటువంటివో లోకానికి తెలిసి ఉండేది. వల్లూరి సూర్యనారాయణరావుగారు స్వీయ చరిత్రం రెంటాల సుబ్బారావుగారికి అంకితం చేసినందువల్లా, ఒక అధ్యాయం స్వీయ చరిత్రలో వారిని గూర్చి వ్రాసినందువల్లా, ఆయనతో తమకు గల సాన్నిహిత్యం ప్రసక్తం చేసినందువల్లా, సమకాలికమైన విస్తృత చరిత్ర తెలుసుకోవటానికి వీలేర్పడుతున్నది. ఇదే విధంగా దివి గోపాలాచార్యుల వారు ఆయుర్వేద వైద్య విజ్ఞానంలో అఖిల భారత ఖ్యాతి నార్జించిన మహా ప్రతిభావంతులు. ఈ శతాబ్ది భారతదేశంలో విఖ్యాతులైన గొప్ప వైద్యులు. జీవితంలోని నిత్య వ్యగ్రతవల్లను, ఒడిదుడుకులవల్లను స్వీయ చరిత్ర ఆలోచన వారు చేయలేదేమో కాని, కె.ఎస్. కేసరిగారి స్వీయ చరిత్రవల్లనూ, ఆచంట లక్ష్మీపతిగారి స్వీయ చరిత్రవల్లనూ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనుభవాలూ-జ్ఞాపకాలు ద్వారానూ గోపాలాచార్యుల వారిని గూర్చిన విషయాలు తెలుస్తున్నాయి.

ఈ దృష్టితో చూస్తే స్వీయ చరిత్రలు రచించే వారంతా తమను గూర్చి తాము చెప్పుకోవటం కన్నా, తమ జీవితంలో తాము సన్నిహితంగా ఎరిగిన మహామహుల విశిష్ట వ్యక్తిత్వాలను గూర్చి లోకానికి తెలియచెప్పాలనే కుతూహలంతో కూడా తమ అనుభవాలు గ్రంథస్థం చేస్తారనవచ్చు.

కవికొండల వేంకట సత్యనారాయణమూర్తి గారు పాఠశాలోపాధ్యాయులుగా ఉంటూ దేశచరిత్ర, జీవితచరిత్రలు కొన్ని వ్రాశారు. వీరి స్వీయచరిత్రం అముద్రితం. విశాఖపట్నం, విజయనగరం జిల్లాల సామాజిక చరిత్రనంతా మూడు నాలుగు తరాల విస్తృతితో వీరు గ్రంథస్థం చేశారు స్వీయ చరిత్ర ద్వారా. వీరి స్వీయచరిత్ర ద్వారా ఈ శతాబ్ది పూర్వార్ధంలో సాంఘిక రాజకీయ వాతావరణంలో కలుగుతూ వచ్చిన సంచలనాలు తెలుసుకోవచ్చు. రెండు ప్రపంచ మహా యుద్ధాల కాలంలో తెలుగుదేశపు సాంఘిక పరిస్థితులను గూర్చి కూడా ఎన్నో తబ్సీళ్ళు వ్రాశారు శ్రీ సత్యనారాయణమూర్తి గారు.

స్వీయచరిత్రలు రాయడంలో ప్రయోజనం ఏమిటో, అవి చదివినందువల్ల కలిగే ఫలితమేమిటో మనవి మాటల్లో చెప్పారు.

"ఆత్మ చరిత్రలు వ్రాసుకున్న వాళ్ళెవరూ వారి వారి గొప్పతనం ప్రకటించుకోవటానికి వ్రాసుకున్నట్టు నాకు కనపడలేదు. తాను చేసిన కొన్ని పనులు, తన కాలంలో జరిగిన కొన్ని విషయాలు, రికార్డు చెయ్యడానికి మాత్రమే వ్రాసుకున్నారని నా అభిప్రాయం. దీనివల్ల యేమిటి ప్రయోజనం అంటే, సాధారణంగా పైవాళ్ళకి తెలియని కొన్ని విషయాలు చాలాకాలం గడచిపోయిన తర్వాత తెలియజేస్తాయి. మరచిపోయిన వారికి జ్ఞాపకం చేస్తాయి. యిట్టి ఆత్మకథలు చరిత్రకారులకు కూడా యెక్కువ ఉపయోగపడతాయి.

"నా జీవితచరిత్ర వ్రాయడంలో నా ముఖ్యోద్దేశం, నా జీవితకాలంలో నేను పొందిన అనుభవాలు, నాకు కలిగిన అభిప్రాయాలూ, నా జీవితకాలంలో జరిగిన యితర చరిత్రలూ రికార్డు చెయ్యడమే. నా జీవితచరిత్రంతా క్రోడీకరించి వ్రాయడంలో నాకున్నా, యిది జాగ్రత్తగా చదవడంలో నా కుటుంబానికీన్నీ ముఖ్యంగా యెక్కువ వుపయోగకారి అవుతుంది. యితరులకి లోకల్ రికార్డు క్రింద వుపయోగపడవచ్చు" అని వ్రాసుకున్నారు సత్యనారాయణమూర్తి గారు.

# 3. తెలుగు వారి స్వీయ చరిత్రలు

తెలుగులో స్వీయచరిత్ర రచనకు నేనే ఆద్యుణ్ణి అని వీరేశలింగం రాసుకున్నా, స్వీయచరిత్రాత్మకమైన రచనలు ఆయనకు పూర్వమే కొన్ని వెలువడ్డాయి. వీరేశలింగం 1848 వ సంవత్సరం జన్మించాడు. అంతకు పూర్వం సుమారు నూరు సంవత్సరాల క్రిందటే జన్మించిన యేనుగుల వీరాస్వామయ్య ఈస్టిండియా కంపెనీ వారి ప్రభుత్వంలో గొప్ప ఉద్యోగం చేసినవారు, తమ యాత్రాచరిత్రను రచించారు. యాత్రాచరిత్రలు కూడా స్వీయచరిత్రాత్మక సాహిత్యం క్రిందికే వస్తాయి కాబట్టి ఆధునిక సాహిత్య చరిత్రలో వీరాస్వామయ్యగారి కాశీయాత్రాచరిత్రకు ప్రముఖమైన స్థానం ఉన్నది.

ఈస్టిండియా కంపెనీ వారి పరిపాలనాధికారం స్థిరపడిన తరవాత చెన్నపట్నంలో వారు 'సుప్రీంకోర్టు', 'సదర్ అదాలత్ కోర్టు' అనే రెండు ఉన్నత న్యాయస్థానాలు ఏర్పాటు చేశారు. ఇంగ్లీషువారి న్యాయసూత్రాల ననుసరించి రాజ్యాంగాన్ని అనుసరించి ఇంగ్లీషు వారికి తమలో తమకు వచ్చిన వ్యాజ్యాలు, వారికి పూర్తిగా దఖలుపడిన ప్రాంతాలలో వారికీ దేశీయులకు వచ్చిన వ్యాజ్యాలు పరిష్కరించటానికి పరమోన్నతమైన న్యాయస్థానంగా సుప్రీంకోర్టు ఉండేది. దేశీయుల ధర్మశాస్త్ర వ్యవస్థకు అనుగుణంగా విచారించే కేసులు సదర్ అదాలత్ కోర్టువారు విచారించేవారు. ఈ రెండు కోర్టులలో కూడా భాషా పరివర్తకులు ఉండేవారు. సుప్రీమ్ కోర్టులో ప్రధాన భాషా పరివర్తకులుగా యేనుగుల వీరాస్వామయ్యగారు చాలా కాలం పనిచేశారు. 1930 వ సంవత్సరంలో వీరు పరివారంతో కాశీయాత్రచేసి, ఒక సంవత్సరంపైన తాము యాత్రలో చూస్తూ వచ్చిన విశేషాలన్నీ దిన చర్యగా వ్రాసిపెట్టారు. ఆయా ప్రాంతాల స్థల చరిత్రలు, తాము కలుసుకున్న ప్రముఖ వ్యక్తులను గూర్చిన వివరాలు, ఆయా ప్రాంతాల సాంఘిక జీవనం యీ కాశీయాత్రా చరిత్రలో వీరాస్వామయ్యగారు వర్ణించారు. ఇందులో స్వీయ జీవిత విశేషాలు, కుటుంబ వృత్తాంతమూ వర్ణించకపోయినా సమకాలీన సంఘాన్ని గురించీ, ఆధికారిక వ్యవస్థను గురించీ ఎన్నో

విశేషాలు తెలుసుకోవచ్చు. స్వయం కృషితో జీవితంలో ఉన్నతమైన స్థితిని చేరుకున్నవారు వీరాస్వామయ్యగారు. వీరు పదవీ విరమణంచేసే సందర్భంలో సుప్రీమ్ కోర్టు ప్రధాన న్యాయమూర్తి సర్ జాన్‌న్యూబోర్ట్ వీరి ప్రతిభా విశేషాలను ఎంతగానో శ్లాఘించారు. ఆనాడు క్రైస్తవ ఫాదరీలతోను, ఇంగ్లీషు ఉన్నతాధికారులతోనూ మత సాంఘిక విషయాలను నిర్భయంగా చర్చించారు వీరాస్వామయ్యగారు. చెన్నపట్నం వదిలిపెట్టి కాశీయాత్రచేసి మళ్ళీ చెన్నపట్నం చేరటానికి 15 మాసాల 15 రోజుల 10 నిముషాలు తాము యాత్రలో ఉన్నట్లు వీరాస్వామయ్యగారు వ్రాశారు. ఈ 15 నెలల కాలంలో తాము చూసిన మార్గ మధ్యంలోని విశేషాలను, దేవాదాయ ధర్మాదాయ వ్యవస్థలను, ప్రజల విశ్వాసాలను, జీవిత పద్ధతులను వీరాస్వామయ్యగారు కాశీయాత్రా చరిత్రలో వర్ణించారు. తొమ్మిదేళ్ళ చిన్న వయస్సుననే తండ్రి చనిపోగా మద్రాసుచేరి, స్వయం కృషితో ఇంగ్లీషు నేర్చుకుని దొరల ప్రాపకం సంపాదించి క్రమక్రమంగా ఉన్నతోద్యోగాలు చేపట్టారు. వీరి స్వస్థలం ఒంగోలు ప్రాంతం. 1835 వ సంవత్సరంలో ఆనాటి చెన్నపట్నం సుప్రీమ్ కోర్టు ప్రధాన ద్విభాషిగా వీరు పదవీ విరమణం చేశారు కాబట్టి, ఆ రోజుల్లో పదవీ విరమణ వయస్సు 55 సం॥లు కాబట్టి వీరాస్వామయ్యగారు 1850 సంవత్సరంలో జన్మించి ఉంటారు. ఆనాడు తెలుగువాళ్ళ విద్యా విజ్ఞాన సాంస్కృతిక సాంఘిక వికాసానికి గొప్ప కృషిచేసిన మహనీయులు వీరాస్వామయ్యగారు. ఆ రోజుల్లో చెన్నపట్నంలోని రెండు ఉన్నత న్యాయ స్థానాలలో కూడా భాషా పరివర్తకులుగా తెలుగువాళ్ళే ఎక్కువ మంది ఉన్నతోద్యోగాలలో ఉండటం గమనార్హం. నాలుగైదు భాషలలో కావల్సిన పాండిత్యం సంపాదించి న్యాయ స్థానాలలో వివిధ భాషల నుంచి ఇంగ్లీషులోకి తర్జుమాచేసే ఉద్యోగులుగా ఉండేవారు తెలుగువాళ్ళు.

చెన్నపట్నంలోనే ఉన్న మరొక ఉన్నత న్యాయస్థానమైన సదర్ అదాలత్ కోర్టులో ప్రధాన అనువాద అధికారిగా పనిచేసిన వెన్నెలకంటి సుబ్బారావుకూడా వీరాస్వామయ్యగారి వలెనే ఇంగ్లీషులో మంచి పాండిత్యం సంపాదించి, దొరల మెప్పును పొందారు. ఆనాడు మైసూరు రాజ్యంలోని దక్షిణ కనరా జిల్లాలో కొన్నాళ్ళు సుబ్బారావు క్రిందికోర్టులలో ఉద్యోగం చేస్తుండగా జాన్ మెక్‌రెల్ దొరకు కన్నడ వ్యాకరణం రాయటానికి తోడ్పడిన ప్రతిభాశాలి సుబ్బారావు. ఈయన ఇంగ్లీషులో స్వీయ జీవితోదంతం వ్రాశారు. 1784 వ సంవత్సరం

క్రోధినామ సంవత్సరం నవంబర్ 28 వ తేదిన జన్మించిన సుబ్బారావు 1839 వ సంవత్సరంలో కీర్తిశేషులైనారు. వీరుకూడా వీరాస్వామయ్యగారి లాగా ఒకసారి కాశీయాత్ర చేశారు. అటు తర్వాత ఒకసారి రామేశ్వర యాత్ర చేశారు. ఈ యాత్రలు చేసినప్పుడు చూసిన విశేషాలనేకాక తమ కుటుంబ జీవితం, బంధువులు, ఆనాటి పెళ్ళిళ్ళు, సాంఘిక జీవన స్థితిగతులు కూడా గ్రంథస్థం చేశారు. కాబట్టి వీరి యాత్రా చరిత్రను స్వీయ చరిత్రగానే చెప్పవచ్చు. 'లైఫ్ అండ్ జర్నల్ ఆఫ్ వి. సుబ్బారావు' అనే పేరున వీరు దీనిని వ్రాశారు. అయితే సుబ్బారావుగారి జీవిత కాలంలో ఇది అచ్చుకాలేదు. 1873 వ సంవత్సరంలో సుబ్బారావుగారి కుమారులు వెంకట గోపాలరావుగారు మద్రాసులోని ఫాస్టర్ ప్రెస్సులో ఈ స్వీయ జీవిత యాత్రోదంతాన్ని అచ్చువేశారు.

వింతగొల్పే విషయం ఏమంటే-19, 20 శతాబ్దులలో వెలసిన ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నిటిపైనా ఇంగ్లీషు ప్రభావం అనల్పంగా ప్రసరించటం. తెలుగువారు వ్రాసిన మొదటి కవుల చరిత్ర ఇంగ్లీషులో వెలువడ్డట్లే, తెలుగువారు వ్రాసిన మొదటి స్వీయ చరిత్రకూడా ఇంగ్లీషులోనే వెలువడింది. 1822 వ సంవత్సరంలో మద్రాసు ప్రభుత్వం వారి కోరికపై రాష్ట్రంలోని ప్రాథమిక విద్యాభ్యాసంపై పాఠశాలా పుస్తక నిర్ణాయక సంఘంవారికి ఒక నివేదికను సమర్పించారు సుబ్బారావు. ఆ నివేదికను కూడా ఈ స్వీయ చరిత్రలో సుబ్బారావుగారు చేర్చారు. 19 వ శతాబ్దపు పూర్వార్ధంలోని తెలుగు దేశపు సాంఘిక జీవన పరిస్థితులు సుబ్బారావుగారి జీవయాత్రా చరిత్ర నుంచి తెలుసుకోవచ్చు.

అటు తర్వాత పేర్కొన వలసిన స్వీయచరిత్రం మహా మహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యుల వారిది. వెన్నెలకంటి సుబ్బారావు స్వీయ చరిత్రం ఇంగ్లీషులో ఉంటే, పరవస్తువారిది సంస్కృతంలో ఉంది. సుమారు నూరు శ్లోకాలలో తమ వంశ చరిత్రాన్ని, తమ జీవిత విశేషాలను గ్రంథరచనా క్రమాన్నీ రంగాచార్యులవారు యీ స్వీయోదంతంలో పేర్కొన్నారు. విక్టోరియా రాణి రాజ్య పరిపాలన స్వర్ణోత్సవ సందర్భంగా అఖిల భారతదేశంలో మహా మహోపాధ్యాయ బిరుదం పొందిన నలుగురు విద్వాంసులలో శ్రీ రంగాచార్యుల వారొకరు. శబ్దార్థ సర్వస్వం అనే విజ్ఞాన సర్వస్వాన్ని సంస్కృతంలో కూర్చారు రంగాచార్యులవారు. అందులో తమ స్వీయ చరిత్రను విరచించారు.

అటు తర్వాత పద్య స్వీయ చరిత్రను రచించిన వారు మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు. వీరేశలింగానికన్నా 15సం॥లు ముందు జన్మించారు

పార్వతీశ్వర శాస్త్రి. బొబ్బిలి సంస్థాన ఆస్థానకవిగా ఉండేవారు. మొత్తం ఎనభై నాలుగు గ్రంథాలు రచించారు. ఆశువుగా స్రగ్ధరాది విశేషవృత్తాలు మాలికగా చెప్పగల ప్రజ్ఞా సంపన్నులు. విశాఖపట్నంలో ఆర్షసమాజం ఆధ్వర్యంలో పరవస్తు వేంకటరంగాచార్యులవారు హిందూమతాన్ని గూర్చి ఉపన్యసించగా శ్రుతి స్మృతి ఉపనిషత్తుల ప్రమాణాలతో యీ ఉపన్యాసాన్ని అంతా మీరు పద్య మాలికగా కూర్చగలరా అని సదస్యులు అడగగా ఆ సభకు వేంచేసి ఉన్న పార్వతీశ్వర శాస్త్రుల వారు ఆ రాత్రికి రాత్రి ఉపన్యాసమంతా మననం చేసు కుంటూ మూడు వందల పాదాలకుపైగా ఉత్పలమాల మాలికగా రచించటం వీరి ఏకసంథా గ్రహణ ప్రతిభకు, మేధాశక్తికి నిదర్శనం. ఈ ఉపన్యాస మాలిక ఆరోజుల్లో ప్రసిద్ధి వహించిన సారస్వత పత్రిక అముద్రిత గ్రంథ చింతామణిలో వెలువడింది. గొప్ప ప్రతిభా వంతులు పార్వతీశ్వర శాస్త్రిగారు. వీరుకూడా బొబ్బిలి రాజా వారితో భారతదేశ సంపూర్ణ యాత్రలో పాల్గొని ఉత్తర దేశయాత్రను, దక్షిణదేశ యాత్రనూ రెండు భాగాలుగా రచించి ఒకే సంపుటంలో ప్రచురించారు. ఇది చాలా గొప్పగ్రంథం. దీన్నిబట్టి క్రిందటి శతాబ్ది చివరి పాదంలో భారతదేశ సాంఘిక పరిస్థితులు ఏ విధంగా ఉండేవో తెలుసుకోవచ్చు. దర్శించిన ఆయా పుణ్యక్షేత్రాలు, వాటి వివరాలు, స్థల పురా ణాలు, ఆ దైవతప్రశస్తి ఏ యే పురాణాలలో విపులంగా ఉన్నదీ యీ వివరా లన్నీ పార్వతీశ్వర శాస్త్రిగారు యాత్రాచరిత్రలో కూర్చారు. అప్పటికే భారత దేశంలో రైలుబళ్ళు వచ్చాయి కాదట్టి, ఆ నాటి రైలు చార్జీలు, ప్రయాణంలోని వింతలు విశేషాలు ఎంతో ఆసక్తికరంగా వర్ణించారు శాస్త్రిగారు. యేనుగుల వీరాస్వామయ్యగారి యాత్రా చరిత్ర వెలువడిన అర్ధ శతాబ్దం తర్వాత వచ్చిన పార్వతీశ్వర శాస్త్రిగారి స్వీయ చరిత్రలో భారతీయ సామాజిక జీవనంలో యీ అర్ధశతాబ్దిలో వచ్చిన మార్పులు పొడకడతాయి. వీరాస్వామయ్యగారిని గురించిన ప్రసక్తి కూడా పార్వతీశ్వర శాస్త్రిగారి యాత్రా చరిత్రంలో ఉంది. వెంకటగిరి సంస్థానాన్ని కూడా పార్వతీశ్వరశాస్త్రిగారు దర్శించి, వారికి కృతులు అంకితం చేశారు. వెంకటగిరి సంస్థానం వారికి మిక్కిలి ఇష్టులైన పూండ్ల రామకృష్ణయ్య పంతులు గారికి పార్వతీశ్వర శాస్త్రిగారు కూర్చు మిత్రులు. పూండ్లవారు పార్వతీ శ్వర శాస్త్రిగారిని స్వీయ చరిత్ర వ్రాయవలసిందిగా వొత్తిడి చేయగా శాస్త్రిగారు పద్యశతకంలో తమ స్వీయ చరిత్రను వ్రాసి రామకృష్ణయ్య గారికి పంపారు.

రామకృష్ణయ్య పంతులుగారి పీఠికతో యీ స్వీయ చరిత్రం నెల్లూరు నుంచి ప్రకటితమైంది. పార్వతీశ్వర శాస్త్రిగారి కుమారులు కామకవిగారు యీ శతకానికి వ్యాఖ్యానం కూడా కూర్చారు. అంటే ఆనాటి చారిత్రకాంశాలను విపులంగా ప్రస్తావిస్తూ కుటుంబగాథ, విజయనగరం, బొబ్బిలి సంస్థానాల వృత్తాంతాలు సందర్భానుసారంగా ఆ పద్యాలలో ప్రసక్తి వచ్చినప్పుడు వచనంలో వివరణ వ్రాశారు కామకవిగారు. అందువల్ల యీ స్వీయచరిత్రకు చారిత్రకమైన ప్రాధాన్యం ఉన్నది. 'ఆత్మ పర్యాయ సపర్యాచర్య' అని యీ శతకానికి పేరు పెట్టారు పార్వతీశ్వరశాస్త్రి గారు. 'హరిహరేశ్వరదేవ మహానుభావ' అనేది యీ సీసపద్య శతకానికి మకుటం. శంకర భగవత్పాదుల వారు శివానంద లహరిలో చెప్పినట్లు ''యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనం" అనే రీతిని తమ జీవితచర్య అంతా భగవంతుడే నడిపించాడు, జరగవలసినవన్నీ ఆయన సంకల్పానుసారమే జరిగాయి. ఇందులో తన కర్తృత్వం ఏమీ లేదన్న స్వాత్మార్పణ ప్రశ్రయబుద్ధితో పార్వతీశ్వరశాస్త్రిగారు తమ జీవితమంతా ఆయన సపర్య నిమిత్తమే అర్పితమైనది అనే భావంతో యీ శతకాన్ని ధ్వనింపజేశారు. ఇది చాలా గొప్ప శతకం. ఈ మహాత్ముడు పరమపదించే రోజున కూడా 'మృత్యుంజయునకు నమస్కరింతు దరింతున్' అనే మకుటంతో కొన్ని పద్యాలు చెప్పి ఆ శతకాన్ని పూర్తిచేసి సంపూర్ణమైన ఎరుకతోనే యీ దేహాన్ని వదలిపెట్టినట్లు రామకృష్ణయ్య పంతులుగారు వ్రాశారు. మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారి వద్ద తెలుగు, సంస్కృతం, ఒడియా, బెంగాలీ, నాగరిలిపులతో ఉన్న గ్రంథాలు ఆరువేల సంఖ్యను మించి ఉండేవని ఆయన వ్రాసుకున్నారు. ఇందులో చాలా తాటాకు గ్రంథాలు. తమ కాలంలో జరిగిన ఒక సతీసహగమన వృత్తాంతం కూడా యీ హరి హరేశ్వర శతకంలో ప్రసక్తం చేశారు శాస్త్రిగారు.

ఆటు తర్వాత స్వీయ చరిత్రాంశాలు తమ కృతిలో పొందుపరచినవారు కొక్కొండ వేంకట రత్నం పంతులుగారు. వీరి బిల్వేశ్వరీయం మహాకావ్యంలోనూ, బిల్వేశ్వర శతకంలోనూ వేంకటరత్నం పంతులుగారు సంగ్రహంగా స్వీయ చరిత్రను చెప్పుకున్నారు.

వీరేశలింగంతో ఆధునికాంధ్ర సాహిత్యంలో ఒక నూతనయుగం ప్రారంభమైంది. ఇదివరలో తెలుగులో లేని ఎన్నో ప్రక్రియలను తెలుగులోకి వీరేశలింగం

పంతులు గారు తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. నవల, నాటకం, వ్యాసం, కవుల చరిత్ర, దేశచరిత్ర, జీవిత చరిత్ర వ్రాయటానికి మార్గదర్శక సూత్రాలు ఏర్పరిచిన వారు వీరేశలింగం పంతులుగారనే చెప్పాలి. ఆయన సంఘ సంస్కరణోద్యమం జగద్విదితం. ఇంగ్లీషులో స్వీయ చరిత్ర ప్రక్రియను వీరేశలింగం బాగా పరిశీలించి తాము తలపెట్టిన ఆత్మ చరిత్ర ప్రణాళికను రూపొందించినట్లుగా కనపడుతుంది. ఈ దృష్ట్యా ఆధునిక సాహిత్యంలో సర్వాంగ పరిపూర్ణమైన స్వీయచరిత్ర వీరేశలింగంతోనే ప్రారంభమైందని చెప్పాలి. అందు కనే స్వీయ చరిత్ర రచనకు తెలుగులో నాదే ప్రథమ ప్రయత్నమని వీరేశలింగం ప్రస్తావించాడు. వీరేశలింగం ప్రణాళికలో సౌష్ఠవం ఉన్నది. ఆయన స్వీయ చరిత్ర రెండు భాగాలలో కలిసి 8 ప్రకరణాలున్నాయి. జననమాదిగా నలభై సంవత్సరాల వరకు తమ జీవితంలో సంఘటిల్లిన చరిత్రనంతా ఒక సంపుటి గాను, అటు తరవాత మూడు దశాబ్దాలు తమ జీవితంలో జరిగిన సంఘటనలను రెండో సంపుటంగానూ పంతులుగారు కూర్చారు. తన జనన కాలంనాటి సాంఘిక పరిస్థితులు, కుటుంబ వృత్తాంతం, శైశవం, కౌమారం, చదువు సంధ్యలు మొద లైనవన్నీ మొదటి ప్రకరణంలో రచించారు. అటు తర్వాత ఉపాధ్యాయత్వ, పత్రికా విలేఖికత్వ ప్రథమ దశ అనే ప్రకరణం ఉందీ స్వీయచరిత్రలో. వీరేశ లింగం ప్రభుత్వోద్యోగంకన్నా తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటానికి స్వతంత్ర వృత్తి అవలంబించటం అగత్యమని తలచాడు. అందువల్ల ఉపాధ్యాయుడిగా ఆయన ఉద్యోగ జీవితం ప్రారంభించాడు. సంఘం లోని అవకతవకలను, చెడుగును నివారించటానికి పత్రిక అమూల్యాయుధంగా భావించి ఒక పత్రికను నిర్వహించటానికి పూనుకొన్నాడు. పాతికేళ్ళ వయస్సు ననే ఆయనకు పత్రిక నడపాలన్న కోర్కె కలగటం ఆయన విశిష్ట వ్యక్తిత్వ ద్యోతకం. 1874 వ సంవత్సరం చివరలో ఆయన వివేకవర్ధని అనే మాస పత్రికను రాజమహేంద్రవరం నుంచి వెలువరించటానికి పూనుకున్నాడు. పత్రికా నిర్వాహణంలో ఆయనకు పరమాశయం ఇంకొకటికూడా ఉంది. అది భాషాభివృద్ధి. భాషాభివృద్ధికి దేశాభివృద్ధికిగాను యీ పత్రికా ప్రచురణ భారాన్ని తాము వహిస్తున్నట్లు పంతులుగారు చెప్పుకున్నారు. నవలలు, నాటకాలు, ప్రహస నాలు, సాహిత్య విమర్శ, పుస్తక సమీక్ష, కవుల చరిత్ర, సామాజిక చైత న్యోద్బోధకమైన వార్తలు ప్రకటించటానికి వివేకవర్ధని పత్రిక పంతులుగారికి అమూల్యమైన సాధనమైంది. సమాజంలో కొందరు పెద్దలతో బలవద్విరోధం

కూడా పత్రికా మూలంగా ఆయన కొని తెచ్చుకున్నాడు. అటు తర్వాతి ప్రకరణం సంఘ సంస్కార ప్రయాస దశ. ఆనాటి సంఘంలోని వేశ్యాలంపటత్వం, బాల్య వివాహాలు, నిర్బంధ వైధవ్యం, లంచగొండితనం, అధికార దుర్వినియోగం మొదలైన వాటిని సంస్కరించాలని వీరేశలింగం పంతులు హోరాహోరీ పోరాడాడు. బాలవితంతువులకు మళ్ళీ పెళ్ళిళ్ళు చేసే విప్లవాత్మకమైన సంఘ సంస్కరణోద్యమానికి ఆయన పూనుకున్నాడు. ఈ వివరాలన్నీ వీరేశలింగం స్వీయ చరిత్ర మొదటి భాగం మూడో ప్రకరణంలో ఆయన పొందు పరిచాడు. నాలుగో ప్రకరణం పత్రికా విలేఖికత్వ, ఉపాధ్యాయత్వ ద్వితీయ దశ. రాజమండ్రి ప్రభుత్వ కళాశాల ద్వితీయ పండిత పదవి నుంచి చెన్నపట్నం రాజధానీ కళాశాలలో పండిత పదవి పొందిన వరకు ఆయన జీవిత చరిత్ర ఘట్టాలను యీ ప్రకరణం వివరిస్తున్నది. రాష్ట్ర రాజధానిలో కూడా సంస్కరణోద్యమాన్ని కొనసాగించటం, తమ గ్రంథాలన్నీ సంపుటాలుగా ప్రచురించటం యీ ప్రకరణంలో ప్రసక్తం. ఇంతటితో ప్రథమ భాగం ముగుస్తుంది. రెండో భాగంలో రాజమహేంద్రవరంలో పంతులు గారు పూనుకొన్న సంస్థా నిర్మాణం గురించిన వివరాలున్నవి. పురమందిరం, ప్రార్థనా సమాజ మందిరం, బాలికా పాఠశాల, ఆస్తిక పాఠశాల, అగతిక మాతా శిశు సంరక్షణ శాల మొదలైన సంస్థలెన్నో స్థాపించారు పంతులు గారు. కిందటి శతాబ్దంలో తెలుగు దేశంలో అంతటి సంస్థా నిర్మాత మరొకరు లేరని చెప్పాలి. ఈ వివరాలన్నీ రెండో భాగం ప్రథమ ప్రకరణంలో చెప్పారు పంతులుగారు. రెండో భాగం రెండో ప్రకరణం గ్రంథ కర్తృత్వదశ. శతాధిక గ్రంథకర్త వీరేశలింగం. వీటిని రచించటానికి తమకు ఎప్పుడు ఎందుకు ప్రేరణ కలిగిందో ఆ వివరాలన్నీ యీ ప్రకరణంలో పొందు పరిచారు వీరేశలింగం. అర్ధ శతాబ్ది కాలం నిర్విరామంగా పంతులు గారు సాహిత్య కృషి చేస్తూనే ఉన్నారు. అచ్చులో సుమారు పదివేల పుటల బృహత్పరిమాణ సంపుటాలలో ఇమిడే సాహిత్యాన్ని ఆయన పండించారు. వీరేశలింగం పంతులు చేతిమీద వెలువడ్డ సాహిత్య సంపుటాలన్నిటికీ స్వీయ చరిత్ర రెండో ప్రకరణం రచయిత వ్రాసుకున్న మంచి ఉపోద్ఘాతంలా ఉపకరిస్తుంది. అటు తర్వాత ప్రకరణం విశ్రాంతి దశ. ఉపాధ్యాయ వృత్తినుంచి పదవీ విరమణ చేసిన తర్వాత చెన్నపట్నంనుంచి తిరిగి రాజమండ్రి వచ్చి అక్కడ అయన చేపట్టిన కార్యక్రమాన్ని వివరించే ప్రకరణం ఇది. వృద్ధాప్యంలో ఆయన ఎదుర్కొన్న సాధక బాధకాలన్నీ ఇందులో ఆయన వివరించారు. అటు

తర్వాత ప్రకరణం అసహాయదశ. 1910వ సంవత్సరంలో పంతులుగారికి అరవై రెండో ఏట భార్యావియోగం కలిగింది. అప్పటి నుంచి ఆయన జీవితంలో ఎన్నో కష్టాలు ప్రారంభమైనాయి. అందువల్ల యీ ప్రకరణాని కాయన అసహాయ దశ అని పేరు పెట్టారు. శిశువుకు తల్లివలె, కంటికి రెప్పవలె తన ఇల్లాలు తనను కాపాడుకుంటూ వచ్చిందని స్వీయ చరిత్రను ఆమెకు అంకితం చేస్తూ పంతులు గారు ప్రేమాభిమానాలతో, కృతజ్ఞతాపూర్వకంగా ఇల్లాలిని స్మరించుకున్నారు. చిలకమర్తి వారన్నట్లు వీరేశలింగం చరిత్ర ఒక శతాబ్ది ఆధునికాంధ్ర దేశ సాంఘిక చరిత్ర.

వీరేశలింగం స్వీయ చరిత్ర వెలువడ్డ తర్వాత వెంటనే వెలువడ్డ స్వీయ చరిత్ర రాంభొట్ల జగన్నాథశాస్త్రి గారి స్వీయ చరిత్ర. ఇది 1916లో వెలువడింది. వీరేశలింగం స్వీయ చరిత్ర మొదటి భాగం 1911 వ సం॥మూ, రెండో భాగం 1915 వ సం॥మూ వెలువడ్డాయి. కీర్తిశేషులు కొమర్రాజు లక్ష్మణ రావు పంతులు ఈ స్వీయ చరిత్రకు పరిచయ వాక్యాలు వ్రాశారు. ఆయన పూనికవల్లనే వీరేశలింగం తాను రెండో భాగం పూర్తి చేసినట్లు అవతారికలో ప్రస్తావించారు. విజ్ఞాన చంద్రికామండలి పక్షాన వీరేశలింగం స్వీయ చరిత్రం తొలిసారి అచ్చయింది. రెండుసార్లు సంగ్రహరూపంలోనూ, నాలుగుసార్లు యథాతథంగాను ఇప్పటికి వీరేశలింగం స్వీయ చరిత్ర ఆరుముద్రణలు పొందటం తెలుగు వాళ్ళకు ఆ మహామహుడిపట్ల గల ప్రేమాభిమానాలను గౌరవాదరాలను వ్యక్తం చేస్తున్నది.

వీరేశలింగం స్వీయ చరిత్రం వెలువడ్డ తర్వాత అందులో ఆయన అనివార్యంగా కొందరు వ్యక్తులను గూర్చి అప్రియాలు వ్రాయవలసి వచ్చినందువల్ల సమకాలిక సంఘంలో కొందరికి కష్టం తోచి ఉంటుంది. కొన్ని పత్రికలు స్వీయ చరిత్రను కొంత విమర్శించకపోలేదు. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు స్వీయ చరిత్ర అనే పదం వ్యాకరణ దుష్టమనీ, అస లటువంటి పదసృష్టి చేయటానికి వీలే లేదని స్వకీయ లేదా సేవ లేదా స్వచరిత్రమని అనాలి కానీ, స్వీయ చరిత్రం ఉద్దిష్టమైన అర్థాన్ని ఇవ్వజాలదని ఆర్య మత బోధిని పత్రికలో విమర్శించారు. ఇంతేకాదు, వీరేశలింగం స్వీయ చరిత్రలోని అనేక విషయాలను బ్రహ్మయ్యశాస్త్రిగారు విమర్శించారు. అసలు తెలుగు సాహిత్యంలో స్వీయ చరిత్రమన్న పదాన్ని సృష్టించిన వారు వీరేశలింగం పంతులుగారు కాదు.

ఆయనకు సుమారు పది పదిహేను సంవత్సరాలకు పూర్వమే గురజాడ శ్రీరామ మూర్తి పంతులుగారు రచయిత తన చరిత్రను తానే వ్రాసుకోవటం అనే అర్థంలో ఈ పదాన్ని ఉపయోగించారు. తెలుగులో కవి జీవితాలను మొదట ప్రకటించిన వారు శ్రీరామమూర్తి పంతులుగారే. ఈ కవి జీవితాలను శ్రీరామమూర్తి పంతులుగారు మొదట రాజయోగి పత్రికలో ప్రకటిస్తూ, ఇప్పటి కవులు తమ స్వీయ చరిత్రలు తామే ప్రకటించుకోవటం అభిలషణీయమనీ, అందువల్ల తాము కొందరు పూర్వ కవుల వృత్తాంతాలను సేకరించి ప్రకటిస్తున్నామనీ పేర్కొన్నారు. ఈ విధంగా స్వీయ చరిత్రనే ప్రయోగం మొదటిసారి వెలువడింది. అటు తర్వాత యీ ప్రక్రియకు ఈ పేరే రూఢమైంది. కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారి ఆక్షేపణను ఎవరూ పట్టించుకొన్నట్లులేదు. ఇందుకు నిదర్శనంగా వీరేశలింగం స్వీయ చరిత్ర వెలువడ్డ సంవత్సరానికి వచ్చిన రాంభొట్ల జగన్నాథ శాస్త్రిగారి ఆత్మకథకు కూడా స్వీయ చరిత్రము అని పేరుండడం చూడవచ్చు.

రాంభొట్ల జగన్నాథశాస్త్రిగారి స్వీయ చరిత్ర ద్వారా విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, ఇంకా ఉత్కలాంధ్రం సాంఘిక జీవన విధానం తెలుస్తుంది. విజయనగర సంస్థానికి సంబంధించిన సమకాలిక చరిత్ర కూడా తెలుస్తుంది. చోడవరం జిల్లా మున్సబు న్యాయ సభలో వకీలుగా విశేష ఖ్యాతినార్జించారు జన్నాథశాస్త్రిగారు. వీరు 1850వ సం॥లో జన్మించారు. పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థపు ఇంగ్లీషు చదువులు, న్యాయస్థానాలు, జనుల జీవనవిధానం, ఆనాటి పండితులు మొదలైన తబ్సీళ్ళు యీ స్వీయ చారిత్రం ద్వారా తెలుసుకోవచ్చు. నిరుపేద కుటుంబస్థితిగతులనుంచి సంఘంలో సమ్మాన్యమైన స్థానానికి చేరుకున్నారు జగన్నాధశాస్త్రిగారు. 1850 వ సంవత్సరంవరకూ దేశంలో బందిపోటు దొంగతనాలు అడపాదడపా సంభవిస్తూ ఉండేవనీ, అటువంటి బందిపోటు 1850వ సంవత్సరం కళ్ళేపల్లి అగ్రహారంలో జరిగిందనీ జగనాధశాస్త్రి వర్ణించారు. నిజాం రాష్ట్రం గోలుకొండనుంచి గుర్రాలవ్యాపారం నిమిత్తంవచ్చిన ఒక ముస్లింవర్తకుడు ఆరోజున కళ్ళేపల్లి అగ్రహారంలో దైవవశాన బస చేయటం తటస్థించిందనీ, ఆ వీరుడు మన్నె సింగందొర అనే బందిపోటు నాయకుడు సాగించిన దౌర్జన్యాన్ని వాంటిచేతిమీద త్రిప్పికొట్టాడని, చేతిలో కత్తితో, ఈటెలు, విల్లులు, తుపాకులతో తనపైన పడ్డ దొంగల గుంపును చెదరగొట్టాడని జగన్నాథశాస్త్రి వర్ణించారు. ఆనాటి గంజాం మండలం, ఉత్కలదేశం స్థితిగతులు కూడా జగన్నాథ శాస్త్రి గారి స్వీయ చరిత్రం ద్వారా తెలుస్తాయి.

ఇటు తరువాత 1931వ సంవత్సరంలో వల్లూరి సూర్యనారాయణరావు గారి స్వీయ చరిత్రం వెలువడింది. దీని కాయన స్వీయ చరిత్ర మని పేరు పెట్టినా సూర్యనారాయణీయమని కూడా పిలుచుకొన్నారు. సూర్యనారాయణరావు గారు బందరులో ప్లీడరుగా ప్రాక్టీస్ చేశారు. హైకోర్టు వకీలుగా కూడా ఖ్యాతి గాంచారు. దేవాదాయ ధర్మాదాయ వ్యాజ్యాలలో విశేషించి సాంఘిక సేవ చేశారు. రాజమహేంద్రవరంలో ఉన్నత పాఠశాల తరగతులు చదివారు. వీరేశలింగంగారి శిష్యులు. మద్రాసులో ఎల్. టి. చదివారు, లా డిగ్రీ కూడా తీసుకున్నారు. రెంటాల వేంకటసుబ్బారావు గారితో కలిసి మందుల వ్యాపారమూలా, పుస్తకాల ప్రకటనమూ నిర్వహించారు. ఈయన స్వీయ చరిత్ర ద్వారా ఆనాటి సంఘ సంస్కరణోద్యమాలు, రాజకీయోద్యమాలు తెలుగుదేశాన్ని ఏ విధంగా ప్రభావితం చేశాయో తెలుసుకోవచ్చు.

అటు తర్వాత పేర్కొన వలసింది రాయసం వెంకటశివుడుగారి స్వీయచరిత్ర ఆత్మ చరిత్రము. ఆంధ్ర గ్రంథమాల ప్రచురణగా కాశీ నాధుని నాగేశ్వరరావు పంతులుగారి పరిచయంతో 1933 వ సంవత్సరం యీ ఆత్మ చరిత్రము వెలువడింది. ఈ శతాబ్ది ప్రథమార్థంలో తెలుగుదేశం చెప్పుకో దగ్గిన విద్యావేత్తలలో రాయసం వెంకటశివుడుగారొకరు. నెల్లూరు, పర్లాకిమిడి కళాశాలలకు ప్రిన్సిపాలుగా పనిచేశారు. వీరేశలింగంగారి దగ్గర శిష్యరికం చెయ్యటమే గాక అన్నిటా ఆయన అనుయాయి. మహిళల మనో వికాసం కోసం 'తెలుగు జనానా' అనే పత్రికను కొన్ని సంవత్సరాలు వీరు నిర్వహించారు. వీరేశలింగ సంస్కృతి అనే గ్రంథంలో వీరేశలింగంపట్ల తమకు గల అభిమానాన్ని ఆయన వెల్లడించారు.

ఈ కాలంలోనే వెలువడిన మరొక స్వీయచరిత్రం బలభద్ర కోటయ్య గారిది. ఈయన కృష్ణాజిల్లా వక్కలగడ్డనివాసి. ప్రభావ శీలమైన వయస్సున బ్రహ్మసమాజాదర్శాలచే ఆకర్షితుడైనవాడు. ఈయన స్వీయ చరిత్రలో వ్యక్తిగత మైన సాధనలు, అనుష్ఠానాలు, సమస్యలు, ప్రసక్తం చెయ్యటం జరిగింది. కొన్ని ఆదర్శాలకు కట్టుబడి సంఘంలో జీవించాలంటే ఎటువంటి పరీక్షలు ఎదురవు తాయో ఒక సామాన్యమానవుడి అనుభవాలుగా యీ స్వీయచరిత్రలో వర్ణించటం జరిగింది. వీరేశలింగం స్వీయ చరిత్రలో రెండో భాగం 1915 న వెలువడిన తర్వాత నాలుగు దశాబ్దాలదాకా పట్టుమని పది పదిహేను స్వీయ చరిత్రలు

కూడా వెలువడ లేదు. ఇది గమనార్హం. రాయసం వారిది వచ్చిన తర్వాత వెలువడ్డ స్వీయ చరిత్రలలో ప్రకాశం పంతులుగారి స్వీయ చరిత్ర నా జీవితయాత్ర, చిలకమర్తివారి స్వీయ చరిత్ర, కొండ వెంకటప్పయ్య పంతులు గారి స్వీయ చరిత్ర, కె.ఎన్. కేసరిగారి నా చిన్ననాటి ముచ్చట్లు, దర్శి చెంచయ్యగారి నేనూ నా దేశం పేర్కొనదగినవి.

ప్రకాశంపంతులుగారి స్వీయచరిత్ర ఒక అద్భుత వీరగాథ. ధైర్యసాహసాలలో త్యాగ పౌరుషాలలో ఒక చరిత్రను సృష్టించిన మూర్తిమంతం పంతులు గారిది. ఈయన స్వీయచరిత్ర ద్వారా భారత స్వాతంత్రోద్యమ చరిత్ర తొలి రోజుల త్యాగ సంభరిత సంచలనాలు తెలుస్తాయి. ప్రకాశం లండన్‌లో బారిస్టర్ చదవటానికి వెళ్ళిననాటి పరిస్థితులు, మోతీలాల్, బాలగంగాధర తిలక్, చిత్తరంజన్‌దాస్‌లతో ఆయనకు గల సాన్నిహిత్యం, వివేకానందస్వామితో ప్రకాశం ఆధ్యాత్మిక విషయాలు చర్చించటం, బిపిన్‌చంద్రపాల్ మద్రాసు వచ్చినప్పుడు ఆయన ప్రసంగించే సభకు అధ్యక్షుడిగా ఉండటానికి ఎవరూ ముందుకు రాకపోగా, ప్రకాశం మూడురోజులపాటు ఆ సభకు అధ్యక్షత వహించటం, ఉన్నత న్యాయస్థానంలో వాదం చేసేటప్పుడు ఆయన ప్రదర్శించిన నిర్భీకత, రాజమండ్రి మునిసిపల్ రాజకీయాలలో ముప్పైఏళ్ళ వయస్సుననే ఆయన చూపిన చొరవ, సాహసం, ప్రజ్ఞ అత్యద్భుతంగా చదివిస్తాయి యీ స్వీయచరిత్రను. పంతులు నాటకాల్లో వేషాలు వేశాడు. తెలుగు సంస్కృతి, సాహిత్యమంటే ఆయనకు ఎంతో అభిమానం. నన్నయ్య, తిక్కనలకు స్మరణీయమైన స్మారక మందిరాలు నిర్మించాలని తలపోశారు. పంతులుగారి స్వీయచరిత్రం 1952 లో మొదటిసారి వెలువడింది. ఇటు తర్వాత పేర్కొనవలసింది కొండ వెంకటప్పయ్య పంతులుగారి స్వీయచరిత్ర. గాంధీమహాత్ముడు కూడా ఎంతో గౌరవించిన ఆయన పెద్దరికం శిరసావహించిన దొడ్డ వ్యక్తిత్వం వెంకటప్పయ్య పంతులు గారిది. గాంధీగారి పిలుపుకన్నా ముందే నలభై సంవత్సరాల వయసు కూడా ఇంకా రాకుండానే దేశసేవకోసం ప్లీడరీ వృత్తిని విసర్జించిన మహితాత్ముడు వెంకటప్పయ్యపంతులు. ఒక శతాబ్ది కృష్ణా, గుంటూరుజిల్లాల సాంఘిక చరిత్రం పంతులుగారి స్వీయచరిత్రం. పెదనందిపాడు పన్నుల నిరాకరణం సత్యాగ్రహ సందర్భంగా పంతులుగారి సేనా నాయకత్వం, కృష్ణా పత్రికను స్థాపించి సాంఘిక రాజకీయ చైతన్యాన్ని తెలుగువారిలో ప్రోది చేయటం, ఆనాటి చదువులు,

నాటక సమాజాలు, అఖిల భారత జాతీయ కాంగ్రెస్ సమావేశాలు, తొలితరం అగ్రనాయకులతో ఆయన పరిచయాలూ ఇవన్నీ ఎంతో ఆసక్తికరంగా చదివిస్తాయి పంతులుగారి స్వీయచరిత్రను. కొండ వెంకటప్పయ్య పంతులు ఆంధ్రోద్యమ జనకుడు. వంగదేశ విభజనం నుంచి ఉద్భవించిన వందేమాతరం ఉద్యమకాలం నుంచి ఆంధ్ర రాష్ట్రోద్యమం వరకు అన్నింటా అగ్రగామిగా నిలిచినవాడు వెంకటప్పయ్య. పంచమజార్జి పట్టాభిషేక మహోత్సవం 1911 లో ఢిల్లీదర్బారు పేరిట జరిగింది. ఆ దర్బారు చూడటానికి వెంకటప్పయ్య పంతులు వెళ్ళారు. అప్పుడు జరిగిన విశేషాలన్నీ స్వీయచరిత్రలో పేర్కొన్నారు. గాంధీజీ ఆంధ్రదేశం సందర్శించినప్పుడు ఆయన పర్యటన కార్యక్రమాన్ని రూపొందించిన వారు వెంకటప్పయ్యగారే. కాకినాడలో 1923 లో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్ సమావేశం పంతులుగారి ఆధ్వర్యంలోనే జరిగింది. సుప్రసిద్ధులైన అఖిల భారతీయ నాయకులెందరో ఆ సమావేశాలకు హాజరైనారు. ఈ విషయాలన్నీ పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాశారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం స్వీయ చరిత్ర వీరేశలింగం స్వీయ చరిత్రకు అనుబంధం వంటిది. తిలక్ నిర్యాణం నుంచి స్వాతంత్ర్యోదయం వరకు ఆంధ్రదేశంలో సామాజిక పరివర్తనలన్నీ తెలియచెప్పే గ్రంథం చిలకమర్తివారిది. ఆనాటి సాహిత్యం, సంస్కృతి, నాటక సమాజాలు, పాఠశాలలు, పత్రికలు, సంఘ సంస్కరణ సభలు అన్నీ చిలకమర్తి స్వీయ చరిత్రలో వర్ణితాలు. చిలకమర్తి వారు దళితజాతుల వారికి రాత్రి పాఠశాలలు నడిపారు. నిమ్నజాత్యుద్ధరణం కోసం రామమోహన రాయల పేరిట పాఠశాల నిర్వహించారు తెలుగునాట అంతా గొప్ప పేరు పొందిన గయోపాఖ్యానం ఆయన ఇరవై రెండేళ్ళ వయసున రచించారు. ఆనాడు లక్షప్రతులపైన అమ్ముడు పోయి తెలుగు పుస్తక ప్రచురణ చరిత్రలో ఒక గొప్ప నమోదును అది సృష్టించింది. చింతామణి నవలల పోటీలో వరసగా మూడు నాలుగు సంవత్సరాలు చిలకమర్తి వారు బహుమతులు గెలుచుకున్నారు. ఆయన పోటీకి నవలలు పంపితే మరెవరికీ బహుమానం రాదన్న వాడుక కూడా పడిపోయింది. గోదావరి జిల్లాలో మొట్ట మొదటిసారి రైలుబండి 1893వ సంవత్సరంలో వచ్చింది. 1895వ సంవత్సరంలో మొట్ట మొదటిసారిగా గోదావరి మండల మహా సభలు జరిగాయి. ఆ సభలో సభా నిర్వాహకులను గూర్చి, సభా వృత్తాంతాన్ని గూర్చి చిలకమర్తి

వ్రాసి చదివిన పద్యాలను చాలా మెచ్చుకొని న్యాపతి సుబ్బారావు పంతులుగారు విజయనగరం పంపించి, ఆ పద్యాలను గురజాడ అప్పారావుగారి చేత ఇంగ్లీషు లోకి అనువాదం చేయించారుట. రాజమండ్రిలో బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసాలను సభా ముఖంగా తెలుగులోకి అనువదించినవారు చిలకమర్తివారే. ఆ సభలోనే వారు చెప్పిన 'భరత ఖండంబు చక్కని పాడియావు' - అనే పద్యం స్వాతం త్ర్యోద్యమ తొలి దశలలో ఆబాలగోపాలానికి రసనాగ్రాల వర్తించేది.

కె.ఎన్. కేసరిగారి 'నా చిన్ననాటి ముచ్చట్లు' విలక్షణమైన స్వీయ చరిత్ర. 1953 వ సంవత్సరం పుస్తక రూపాన ప్రచురితం. అంతకు పూర్వం గృహలక్ష్మి పత్రికలోను, ఆంధ్రజ్యోతి పత్రికలోనూ ఈ చిన్ననాటి ముచ్చట్ల ఘట్టాలు కొన్ని ప్రచురితమైనాయి.

ఇది కేవలము శ్రీ కేసరిగారి స్వీయ చరిత్రకాదు. నిరుపేదగా ప్రారంభ మయిన తమ జీవితమును ఆత్మబలం, స్వయం కృషి, అచంచలమైన దీక్షలతో మహర్దశ పురుషుడుగా రూపొందించుకొనిన వారి జీవయాత్రకు సంబంధించిన వారి చారిత్రాత్మక సంఘటనలు, అనుభవములు కష్టసుఖములు భోగభాగ్యములు దానధర్మములు మొదలగునవి ప్రజానీకంలో నవచైతన్యాన్ని, పురోభివృద్ధిని ప్రోత్సహించగలవని అనేకుల విశ్వాస మన్న ప్రచురణ కర్తల నివేదనతో చదివిన వారంతా ఏకీభవిస్తారు.

విశేష ధనం ఆర్జించి అనేకులకు పలువిధాలైన సాహాయ్యాలు చేసి, విద్యా సంస్థలకు లక్షలకొద్ది విరాళాలిచ్చి, నాగరకులై, స్నేహపాత్రులై ఆంధ్రదేశానికి వన్నె తెచ్చిన ధన్యజీవులు కేసరిగారు అనటం ఏమి అతిశయోక్తికాదు. ప్రశంస కాదు. కాలక్రమానుసారంగా జీవితచరిత్రను వర్ణించే పద్ధతి కాకుండా జీవితంలో అత్యంత ప్రాముఖ్యంగల సన్నివేశాలను. సంఘటనలను, వింతలు, విశేషాలను, పరిచితులను గూర్చి ఆసక్తికరమైన ముచ్చట్లుగా వ్రాశారు కేసరి. ఇందులో మొత్తం 28 ముచ్చట్లున్నాయి. 1375 వ సంవత్సరంలో కేసరిగారు జన్మించారు. 1953లో స్వర్గస్థులైనారు. తమ ఆత్మకథను గూర్చి ప్రస్తావిస్తూ కేసరిగారు "ఇందులో నేను చిన్నతనంలో ఎలా నిరుపేదగా కష్టపడి స్వయం కృషివలన స్వశక్తితో క్రమంగా విశేషంగా ధనమార్జించినదియు, దానిని మొత్తము నా స్వార్థమునకు, విలాసములకు మాత్రం వినియోగించుకోకుండా పరోపకారానికి, సంఘ పురోభివృద్ధికి వినియో గించిన విధము వివరింపబడినది'' అని అనుబంధంలో చెప్పుకున్నారు.

1884 వ సంవత్సరంలో మద్రాసులో మెరీనా బీచ్ నిర్మించారనీ, 1910 వ సంవత్సరం దాకా మద్రాసులో విద్యుద్దీపాలు లేవని యీ మొదలైన విశేషాలు కేసరిగారి చిన్ననాటి ముచ్చట్ల ద్వారా తెలుసుకోవచ్చు. క్రిస్టియన్ కాలేజి ప్రిన్సిపాల్ మిల్లర్ దొరగారి కరుణాళుత్వం, పరోపకారం, శిష్యులపట్ల వారు కనపరచిన అపార అనురాగం రెండో ముచ్చటలో కేసరిగారు వర్ణించారు. అంతకు రెండు సంIIల పూర్వం 1951 వ సంవత్సరంలోనే వేటూరి ప్రభాకర శాస్త్రిగారి స్వీయ చరిత్ర 'ప్రజ్ఞాప్రభాకరం' అచ్చైంది. రెండు వేల పుటల బృహద్గ్రంథంగా శ్రీ శాస్త్రిగారి యోగానుభవాల సహితంగా యీ ఆత్మచరిత్రాన్ని సంకల్పించారుట కాని, వారు 1957 వ సంIIలో స్వర్గస్థులు కావటంతో ఆ సంకల్పం నెరవేరలేదు. 152 పుటల ప్రథమ ముద్రణంలో ఆవేదన, అనారోగ్యం, ఔషధ సన్యాసం అనే ప్రకరణాలలో శాస్త్రిగారు జీవితంలో ఎదుర్కొన్న సమస్యలు, కష్టాలు, ఆయన నిష్కల్మషమైన చిత్తవృత్తి పాఠకులకు ఎంతో చిత్త సంస్కారాన్ని కలుగజేస్తాయి. వెలుగుబాట, వెలుగునీడలు అనే ప్రకరణాలలో శాస్త్రిగారికి లభించిన గురుకృప, యోగానుభవాలు చాలా ఆసక్తి కొలుపుతాయి. చివరి ప్రకరణం నాడీ గ్రంథాలు అనే దానిలో యోగాభ్యాసం, జాతకాలు, మానవ జీవితంలోని ఆధ్యాత్మికానుభవాలు, ఎన్నో విస్మయావహమైన విషయాలు తెలుస్తాయి. 1959 వ సంవత్సరంలో రెండు స్వీయ చరిత్రలు వెలువడ్డాయి. అవి కాశేశ్వరరావు పంతులుగారి నా జీవిత కథ-నవ్యాంధ్రము అనే స్వీయ చరిత్ర, పెద్దిభొట్ల వీరయ్యగారి స్వీయ చరిత్ర. వీరిద్దరూ సామాజిక రాజకీయ రంగాలలో దేశ హితం కొరకు పాటుపడిన మహనీయులు, "ఇవి కేవల జీవిత చరిత్రలే గాక లోకమాన్య తిలకు మహాశయుని కాలము నుండి గాంధీ మహాత్ముని నిర్యాణము వరకును మన దేశములో జరిగిన రాజకీయోద్యమముల ఫలితముగా దేశములోని రాజకీయ, ఆర్థిక సాంఘిక వైజ్ఞానిక వ్యవస్థలందు, ప్రజల చిత్తవృత్తులందు, వ్యక్తుల జీవిత విధానములందు, కలిగిన గొప్ప మార్పులను గూర్చి వర్ణించు చరిత్రలుగ నున్నవి" అని సుప్రసిద్ధ చరిత్ర రచయితలు శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు అభిప్రాయపడ్డారు. వీరయ్యగారి స్వీయ చరిత్రలో వారు చదువుకున్న విజయనగరం విశేషాలు, అక్కడి నాటక సమాజాల చరిత్ర, బెజవాడలో ఆయన లాయరుగా పనిచేసినప్పటి సాంఘిక పరిస్థితులు వర్ణించబడ్డాయి.

అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారి స్వీయ చరిత్రలో అర్ధ శతాబ్ది ఆంధ్రదేశ చరిత్ర, సాంఘిక జీవితం, రాజకీయోద్యమాలు విపులంగా వర్ణించ

బడ్డాయి. ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని గూర్చి కూడా ఎన్నో వివరాలు పొందు పరచ బడ్డాయి. కాశేశ్వరరావు పంతులుగారు 1881 వ సం॥ జన్మించారు. 1930వ సంవత్సరం వరకు తమ జీవితంలో సంభవించిన సంఘటనలను, తాము పాల్గొన్న ఉద్యమాలను స్వీయచరిత్రలో అక్షరబద్ధం చేశారు. ఆంధ్రదేశంలో సాగిన సత్యాగ్రహోద్యమం విపులంగా వర్ణించారు. భారత జాతీయ నాయకులైన చిత్తరంజన్‌దాస్, మహాత్మాగాంధీ, రాజేంద్రప్రసాద్, మదన్‌మోహన్ మాలవ్యాలతో ఆయనకు గల సన్నిహిత పరిచయమూ, ఆంధ్రదేశపు సుప్రసిద్ధ నాయకులైన ప్రకాశం, పట్టాభి, రంగా మొదలైనవారితో నడిపిన రాజకీయోద్యమాలు, ఆంధ్ర మహాసభల వివరాలు, పంతులుగారు తమ జీవితకథలో వర్ణించారు. స్వీయచరిత్రకు నా జీవితకథ అని పేరు పెట్టటంతో వారికి తృప్తి కలగక నవ్యాంధ్రము అనే పేరు కూడా జోడించారు. అంటే పందొమ్మిది ఇరవై శతాబ్దాలలో ఆంధ్రదేశపు సామాజిక పరిణామాలన్నీ ప్రత్యక్షసాక్షులుగా కాశేశ్వరరావు పంతులు గారు ముందుతరాలవారికోసం నమోదు చేశారన్నమాట.

ఈ ప్రాంతాలలోనే శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి గారి స్వీయచరిత్రం వచ్చింది. ఒక్క చేతిమీదుగా భారత భాగవత రామాయణాలు అనువదించిన గొప్ప కవి పండితులు శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి గారు. శతాధిక గ్రంథ కర్తలు. వజ్రాయుధం, కళావతి వంటి సాహిత్య పత్రికలు నిర్వహించారు. నాటకాలు రచించారు. కావ్యాలు రచించారు. వారి గ్రంథరచనా పరిశ్రమను గూర్చి, భారతదేశంలో వివిధ ప్రాంతాలలో వారు పొందిన పురస్కారాలను గూర్చి శాస్త్రి గారు ఆంధ్ర సర్వస్వమనే పత్రికలో స్వీయచరిత్రను సంగ్రహంగా ప్రకటించారు. తరవాత 1959 ప్రాంతాలలో పుస్తక రూపాన శ్రీకృష్ణ స్వీయచరిత్రం ప్రకటితమైంది. ఢిల్లీతో దర్భాంగలో శాస్త్రిలవారి సంస్కృత వైదుష్యానికి జరిగిన సన్మానాలు, వారు పొందిన బిరుదావళాలు, వారిని సమ్మానించిన ప్రసిద్ధులు, వారి గ్రంథాల ప్రాశస్త్యం, ఆ గ్రంథాలను అంకితం పొందిన వారి వివరాలు ఈ స్వీయచరిత్రలో పొందుపరచబడ్డాయి. వారణాసిలో త్రైలింగస్వామి అనే పరమయోగి 1887 వ సంవత్సరం వరకూ ఉండేవారు. ఈ పరమయోగి యోగలీలా వైభవం భారతదేశంలో ముఖ్యంగా వంగదేశంలో సువిఖ్యాతం. కాశీలో త్రైలింగస్వామివారి అర్చావిగ్రహం కూడా పూజించబడుతూ ఉన్నది నేటికీ. కృష్ణమూర్తి శాస్త్రిగారు త్రైలింగస్వామి మందిరాన్ని

దర్శించామని, అప్పుడేవో తమకు దివ్యానుభూతులు కలిగాయనీ ప్రసక్తం చేస్తూ త్రైలింగస్వామిని గూర్చి కొన్ని గాథలు కూడా స్వీయచరిత్రలో వ్రాశారు.

1924, 25 సంవత్సరాలలో వెలువడిన సంగ్రహ స్వీయ చరిత్రలలో కస్తూరి శివశంకరకవి గారి స్వీయ చరిత్రం పేర్కొనదగినది. రాజమహేంద్రవరం ఉన్నత పాఠశాలలోను, అటు తర్వాత కళాశాలలోను కస్తూరి శివశంకర కవిగారు సంస్కృతాధ్యాపకులుగా రెండు దశాబ్దాలకు పైబడి పని చేశారు. మత తత్త్వశాస్త్ర గ్రంథాలు వీరు సంస్కృతంలో ఎన్నో రచించిన మేటి పండితులు. కస్తూరి శివశంకర కవిగారి సత్యసంధతను గూర్చి, పాండిత్యాన్ని గూర్చి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు తమ 'కథలు-గాథలు'లో ప్రసక్తం చేశారు,

వీరేశలింగం పంతులుగారి సమకాలికులైన శృంగారకవి సర్వరాయుడు గారు రచించిన స్వీయ చరిత్రం సచారిత్రంలో ఇనాటి సాహిత్య రీతుల గూర్చిన ప్రసక్తి ఉన్నది.

1956 లో ప్రథమ భాగమూ, 1962 లో ద్వితీయ భాగమూ దాసరి లక్ష్మణస్వామిగారి నా జీవితయాత్ర అనే స్వీయ చరిత్ర వెలువడింది. ఈ స్వీయ చరిత్రలో కవిగారి కుటుంబ జీవిత వృత్తాంతం, వా రెరిగిన సుప్రసిద్ధ కవులు, పండితులు వారి కిచ్చిన ప్రశంసా పత్రాలు, ఆయా సభలూ సమావేశాలలో తాము చేసిన ఉపన్యాసాలు, చదివిన పద్యాలు పొందుపరచబడ్డాయి.

ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో సుప్రసిద్ధ కవి పండితులు, సామాజికోద్యమా లలో పని చేసిన మహనీయులు, స్వీయ చరిత్రలు ప్రకటించారు. ఇటువంటి స్వీయ చరిత్రలలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'అనుభవాలూ-జ్ఞాపకాలూనూ' ముందుగా పేర్కొనదగింది. ఇది మూడు సంపుటాలలో వెలువడింది. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి శైలి అనితర సాధ్యం. ఆయన గొప్ప సృజనాత్మక ప్రతిభా వంతులు, కథా రచయితగా తెలుగుభాష సృజన శక్తిని ఎంతగానో వృద్ధిచేసిన వారు కింవటి శతాబ్దపు చివరిదశ కాలంలో తెలుగువారి సాంస్కృతిక జీవితం, ఈ శతాబ్దంలో ప్రారంభమైన నవ్య సాహిత్యరీతులు, వ్యావహారిక భాషోద్యమం, సాహిత్య సంవాదాలు తమ అనుభవాలూ జ్ఞాపకాలలో శాస్త్రిగారు ప్రతిభావంతంగా వర్ణించారు. తాము విన్నవీ కన్నవీ ఎన్నో అద్భుత వృత్తాంతాలు పొందుపరిచారు.

1952 వ సంవత్సరంలో వెలువడ్డ దరిశి చెంచయ్యగారి నేను-నా దేశం తెలుగులో వచ్చిన స్వీయచరిత్రలలో గొప్ప స్వీయచరిత్ర. 1890 వ సంవత్స

రంలో జన్మించారు చెంచయ్యగారు. 1912 ప్రాంతాలలో వ్యవసాయశాస్త్రం చదవటానికి అమెరికా వెళ్ళారు. అక్కడ లాలా హరదయాళ్, జితేంద్రనాథ లాహిరీ వంటి స్వాతంత్ర్యోద్యమ విప్లవ వీరులతో చెంచయ్య గారికి సన్నిహిత పరిచయం కలిగింది. 1913 లో అమెరికాలో స్థాపించబడ్డ గదర్ పార్టీలో వీరు కూడా సభ్యులైనారు. చెంచయ్యగారి జీవితం అత్యంత సాహసోపేతమైనది. ఒకసారి వీరు నాలుగు సంవత్సరాలు జైల్లో గడపవలసి వచ్చింది. సాయుధ పోరాట వ్యూహరచనలో కీలకమైన పాత్రను నిర్వహించారు చెంచయ్యగారు. ఈ శతాబ్ది పూర్వార్ధంలో తెలుగు దేశంలో వచ్చిన సాంఘికార్థిక రాజకీయ సాంస్కృతికమైన మార్పులన్నీ చెంచయ్య గారి స్వీయ చరిత్రలో ప్రతిబింబిస్తున్నాయి.

లింగం వీరభద్రయ్య చౌదరిగారి స్వవిషయం అనే స్వీయచరిత్ర మూడు సంపుటాలలో వెలువడింది. ఆదాయపు పన్ను శాఖలో ఉన్నతమైన ఉద్యోగం చేశారు వీరు. ఇంగ్లండ్ వెళ్ళి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రులైనారు. న్యాయవాది పట్టా కూడా సంపాదించారు. ఉద్యోగరీత్యా తెలుగుదేశం నలుమూలలా పర్యటించారు కాబట్టి అక్కడ ప్రముఖ వ్యక్తులను, శీతోష్ణ పరిస్థితులను, పంటలను, వ్యాపార, వాణిజ్య స్థితిగతులను శ్రీ చౌదరిగారు స్వీయచరిత్రలో ప్రసక్తం చేశారు. బరంపురం, చిత్తూరు, మద్రాసు, విజయనగరం, హైదరాబాదు, అనంతపురం మొదలైన ఆదాయపు పన్నుశాఖ మండలాలలో వీరు ఉన్నతోద్యోగిగా పనిచేసినందువల్ల ఆయా ప్రాంతీయమైన విశేషాలన్నీ స్వీయచరిత్రలో ఎంతో ఆసక్తిదాయకంగా వర్ణించారు.

1973 వ సంవత్సరంలో ఆచంట లక్ష్మీపతిగారి స్వీయచరిత్ర ప్రకటితమైంది. లక్ష్మీపతి ఆధునిక కాలాన ఆయుర్వేద వైద్య విజ్ఞాన వ్యాప్తికి ఎంతో గొప్ప కృషి చేశారు. పండిత దివి గోపాలాచార్యులవారి పరమాశయాన్ని సాధించటానికి, అల్లోపతి వైద్యంలో పట్టభద్రులై గొప్ప ప్రజ్ఞ కలిగి వుండి కూడా ఆయుర్వేద ప్రచారానికై తమ శక్తి యుక్తులన్నీ ధారపోశారు లక్ష్మీపతి. విజ్ఞాన చంద్రికా మండలి సంస్థాపక సభ్యులలో వీరొకరు. విజ్ఞాన చంద్రికా మండలి ఆధునిక విజ్ఞానశక్తికి చేసిన కృషిని గూర్చి కూడా లక్ష్మీపతిగారు తమ గ్రంథంలో వివరించారు.

3)

సంజీవదేవ్ చిత్రకారుడు. భావుకుడు. సౌందర్యవేత్త. కళా విమర్శకుడు. 1970 సంవత్సరంలో ఆయన స్వీయచరిత్ర మొదటి సంపుటం తెగిన జ్ఞాపకాలు వెలువడింది. తరవాత ఐదారు సంవత్సరాలలో స్మృతిబింబాలు, గతంలోకి అనే మరి రెండు సంపుటాలు వెలువడ్డాయి. ప్రసిద్ధ చిత్రకారుడు అసితకుమార్ హల్దార్ దగ్గర ఈయన చిత్రకళను అభ్యసించారు. జిడ్డు కృష్ణమూర్తి, మహా రచయిత ప్రేమచంద్, మహాపండితుడు, త్రిపిటకాచార్యులు రాహుల్ సాంకృత్యా యన్‌లతో సహా సంజీవదేవ్ గారికి గల పరిచయాలు వీరి స్వీయచరిత్ర సంపు టాల నుంచి ఎంతో ఆసక్తికరంగా చదవవచ్చు.

ఈ శతాబ్దంలో స్వాతంత్ర్యోద్యమంలోను ఇతర రాజకీయ జాతీయోద్య మాలలోను పనిచేసిన మహనీయులు కొందరు స్వీయచరిత్రలు ప్రకటించారు. గొట్టిపాటి బ్రహ్మయ్యగారి నా జీవిత నౌక వృద్ధతరం జాతీయోద్యమ నాయకుడి స్వీయచరిత్ర. తెలంగాణంలో జాతీయోద్యమాలలో పనిచేసిన కొండా వెంకట రంగారెడ్డి, రావి నారాయణరెడ్డి గారలు స్వీయ చరిత్రలు ప్రకటించారు.

అయ్యదేవర కాళేశ్వరరావు గారి నా జీవిత కథ నవ్యాంధ్రంవలెనే మాది రాజు రామకోటీశ్వరరావు గారి స్వీయచరిత్రకు అభ్యుదయ తెలంగాణ చరిత్రాం శము లనే వివరణను కూడా చేర్చారు. తెలంగాణంలో ఈ శతాబ్ద పూర్వార్ధంలో సంభవించిన ప్రజాహితోద్యమాలన్నిటా రామకోటీశ్వర రావుగారు పాల్గొన్నారు. వృత్తిచేత వీరు వకీలు. వీరి స్వీయ చరిత్రలో ఎన్నో ఆసక్తికరమైన విశేషా లున్నాయి. మోతీలాల్ నెహ్రూ, తేజ్ బహదూర్ సప్రూల న్యాయవాద కౌశ లమూ, వారు ఆ రోజుల్లో ఒక్కొక్క కేసులో వాదించటానికి రోజుకు ఎంత ఫీజు తీసుకుంటూ ఉండేదీ యీ వివరాలన్నీ కూడా ఉన్నాయి. 1908 వ సంవ త్సరంలో హైదరాబాదు నగరం మూసీనది పొంగిన బీభత్సంవల్ల ఎటువంటి అల్లకల్లోలానికి గురి అయినదీ, ఎంత ప్రాణనష్టం, ధననష్టం జరిగిందీ వివరిం చారు రామకోటీశ్వరరావుగారు.

జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు స్వీయచరిత్రకు జాతక చర్య అని పేరు పెట్టారు. తిరుపతి వెంకటకవులపట్ల వీరికి గురు భావం. అందువల్ల వారు స్వీయ జీవిత విశేషాలను జాతక చర్య అనే పద్య కావ్యంగా నిబంధించినట్లే పట్టాభి రామశాస్త్రిగారు కూడా స్వీయ చరిత్రకు జాతక చర్య అని పేరు పెట్టారు. గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలోని జానపాడు అనే చిన్న పల్లెటూరు వీరి

నివాస స్థానం. ఇక్కడ నుంచి సుమారు నాలుగు దశాబ్దాల పాటు అభినవ సరస్వతి అనే సాహిత్య పత్రికను వీరు నిర్వహించటం విస్మయావహం. వీరు కొన్నాళ్ళు సికింద్రాబాదులో ఉన్నారు. అందువల్ల ఆనాటి తెలంగాణం సాహిత్య వాతావరణాన్ని కూడా స్వీయ చరిత్రలో చిత్రించారు.

బులుసు వేంకటేశ్వర్లుగారి స్వీయ చరిత్రం 'సర్వదుఃఖ నివారణోపాయం' లో గోదావరి జిల్లాల ఈ శతాబ్ది పూర్వార్ధ సామాజిక విశేషాలు వర్ణితం. శ్రౌతస్మార్తాలలో సుప్రసిద్ధి వహించిన బులుసువారి వంశాన్ని గురించిన విశేషాలు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, వేమూరి రామకృష్ణరావు, సర్వేపల్లి రాధాకృష్ణయ్యలను గురించిన వ్యక్తిత్వ విశేషాలున్నాయి.

సంగీత సాహిత్యాలలో సరితూచిన త్రాసుగా తెలుగువారికి కీర్తి తెచ్చిపెట్టిన అజ్జాడ ఆదిభట్లనారాయణదాసుగారి స్వీయ చరిత్ర 1976 వ సంవత్సరంలో వెలువడింది. క్రిందటి శతాబ్ది చివరి దశకాలాలలోని తెలుగు దేశంలోని గాంధర్వ విద్యా విశేషాలు నారాయణదాసుగారి స్వీయ చరిత్ర ద్వారా తెలుసుకోవచ్చు. జయంతి కామేశం, పనప్పాకం అనంతాచార్లు, సోమంచి భీమశంకరం, లింగం లక్ష్మాజి మొదలైన అపురూప వ్యక్తిత్వాలను గూర్చి ఎన్నో వివరాలున్నాయి. దాసుగారు తమ జీవితంలో ముప్పై సంవత్సరాల చరిత్రమే రచించటంవల్ల ఈ శతాబ్దిలో వారి జీవిత కథ వారి మాటల్లోనే తెలుసుకోవటానికి అవకాశం లేదు. ఆనాటి విజయనగర సంస్థానంలో సంగీత సాహిత్య సరస్వతీ నర్తనం, మైసూరు మహారాజా వారిని దర్శించినప్పుడు అక్కడి సంగీత సాహిత్య విశేషాలు దాసుగారు 'నా యెఱుక' అనే స్వీయ చరిత్రలో వర్ణించారు. తెలుగులో వచ్చిన స్వీయ చరిత్రలో నారాయణదాసుగారి స్వీయ చరిత్రకు విశిష్టమైన స్థానమున్నది.

ఈ శతాబ్ది పూర్వార్ధం నిఖిలాంధ్ర దేశాన్ని తన నటనా వైదుష్యంచే ఉర్రూతలూపిన స్థానం నరసింహారావుగారి స్వీయచరిత్ర నట స్థానం 1974 లో వెలువడింది. ''నా నట జీవితంలో 50 సంవత్సరాల కాలం వెనక్కు చూసుకొని, జ్ఞాపకాని కందినంతవరకూ నా నటనకు దోహదమైన విషయాలనూ భావాలను మనవిజేస్తున్నాను'' అని ముందు మాటలో స్థానం వారు వ్రాశారు. శకుంతలగా, సత్యభామగా, మధురవాణిగా, చిత్రాంగిగా, రోషనారగా, మురగా అశేష ప్రేక్షక లోకాన్ని అలరించిన స్థానం నరసింహారావు ఆనాటి నాటక సమాజాలు,

నాటక శాలలు, ప్రసిద్ధ నటులు, నాటక ప్రదర్శనలు మొదలైన సంగతులు ఎంతో కుతూహలం కలిగే విధంగా వ్రాశారు.

ఈ శతాబ్ది ఉత్తరార్ధంలో వచ్చిన స్వీయ చరిత్రలలో ప్రముఖంగా పేర్కొనవలసింది ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి 'మారుతున్న సమాజం-నా జ్ఞాపకాలు' అనే స్వీయ చరిత్రం. ''దీనిని వ్రాయడంలో నా 90 సంవత్సరాల జీవిత కాలంలో మన సమాజంలో జరిగిన మార్పులను స్పష్టం చేయడం నా ప్రధానోద్దేశంగా పెట్టుకున్నాను. ఈ దృక్పథంతో నేను మా గ్రామం, మా శాఖ, మా కుటుంబం, నా విద్యాభ్యాసం, నా గ్రంథ రచనలు మొదలైన విషయాలను ఇందులో వివరించాను. ఈ దృష్టితోనే మన రాజకీయ ఆర్థిక రంగాలలో జరిగిన మార్పులను విశదీకరించాను. వీటికి సంబంధించిన నా అనుభవాలను, నాలో కలిగిన భావాలను తెలియపరచాను. నా చిన్నతనంలో నేను చూచిన సమాజానికి, ఈనాడు నేను చూస్తూ ఉండే సమాజానికి ఎన్నో తారతమ్యాలు కనపడుచున్నవి. నా స్వీయ చరిత్ర కొంతవరకు వాటికి ప్రతిబింబమని నేను భావిస్తున్నాను'' అని స్వీయ జీవితాన్ని సమీక్షిస్తూ వ్రాశారు వెంకటరంగయ్యగారు. ఏడు దశాబ్దుల కాలం ఆచార్యులు తెలుగు వారికి అధ్యాపకులుగా, రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో హితబోధకులుగా, తత్త్వ నీతిజ్ఞులుగా, వేత్తలుగా ప్రీతిపాత్రమైన మూర్తిమంతాన్ని రూపొందించుకున్నారు. 1889 వ సంవత్సరం వారి జననం. తొమ్మిది దశాబ్దుల కాలం తెలుగుదేశంలో సమస్త సాంఘిక జీవనాన్ని వారు స్వీయ చరిత్రలో ప్రతిభావంతంగా విశ్లేషించి చూపారు. 1897 వ సంవత్సరం వరకు మద్రాసుకు నెల్లూరుకు మధ్య మాత్రమే ఇనుప దారిపైన రైలుబండి నడచేదనీ, 1907 వ సంవత్సరానికి పూర్వం మద్రాసులో ఎలాంటి రాజకీయ సంచలనం కాని వుండేదికాదని, ఇటువంటి చాలా ఆసక్తికరమైన విషయాలు వ్రాశారు వెంకట రంగయ్యగారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు, పి. వి. కాణే, సి. ఆర్. రెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణయ్యల వ్యక్తిత్వాలను గూర్చి ఆసక్తికరమైన విషయా లెన్నో ఉన్నాయి ఆచార్యవర్యుల స్వీయ చరిత్రలో. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోను, అటు తరవాత బొంబాయి విశ్వవిద్యాలయంలోనూ రాజనీతి శాస్త్ర ఆచార్యులుగా వారు ఎన్నో దశాబ్దాలు విద్యార్థులను తీర్చిదిద్దారు. రాజనీతి, భారత దేశ సమాఖ్య వ్యవస్థ, స్థానిక సంస్థలు, అధికార వికేంద్రీకరణం మొదలైన విషయాలను గురించి సాధికారమైన

ఎన్నో గ్రంథాలు, రచనలు చేశారు. విజయనగరం సంస్థానం దివానుగా సుమారు రెండు సంవత్సరాలు పనిచేశారు. మద్రాసు మెరీనాలో బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసాలు విన్న తర్వాత ప్రభుత్వోద్యోగంలో ప్రవేశించకూడదనీ, స్వతంత్ర వృత్తి నవలంబించి దేశ హితం కోసం కృషి చేయాలని నిశ్చయించుకున్నారు. సుమారు 500 పుటల స్వీయ చరిత్రలో వారి సార్థక, సుసంపన్న జీవిత విశేషాలతోపాటు సామాజిక పరిణామ చరిత్ర కూడా సమన్వయం చేయటం యీ స్వీయ చరిత్ర ప్రత్యేకత.

తాపీ ధర్మారావుగారి రాలూరప్పలూ వారి బాల్యకౌమార యౌవనాల ఏక దేశమైన స్వీయచరిత్ర. సాహిత్యోద్యమాలలో, సామాజిక చైతన్యోద్యమాలలో వారు పాల్గొన్న విశేషాలు ఇందులో చోటు చేసుకోలేదు. గిడుగు రామమూర్తి పంతులుగారి దగ్గర పర్లాకిమిడి కళాశాలలో తాపీ వారు చదువుకున్నారు. గిడుగు వారి బోధన గురించి వ్యక్తిత్వం గురించి సన్నిహితంగా ఎరిగిన విషయాలు ఈ స్వీయ చరిత్రలో కన్పిస్తాయి.

గిడుగు సీతాపతిగారి స్వీయ చరిత్ర కూడా సంగ్రహ ప్రణాళికతో 1962 లో వెలువడింది. ఉత్తరాంధ్రంలోని తెలుగు వారి సామాజిక జీవన పరిస్థితులు, వ్యావహారిక భాషోద్యమం, ఆనాటి సాంస్కృతిక విశేషాలు, లండన్, పారిస్ మొదలైన చోట్ల తమ విదేశ పర్యటన విశేషాలు సీతాపతిగారు స్వీయ చరిత్రలో ప్రసక్తం చేశారు.

దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి స్వీయ చరిత్ర యీ దశాబ్దంలో వచ్చిన స్వీయ చరిత్రలలో విలక్షణమైనది. విశ్వవిద్యాలయ స్నాతకోత్తరస్థాయి విద్యార్థులకు కొన్ని దశాబ్దాలు వ్యాకరణం బోధించి, వ్యాకరణ పాఠం చెప్పటంలో తనంతవారు లేరనిపించుకున్న వేంకటరమణశాస్త్రిగారు స్వీయ చరిత్రను సరళ సుందర వ్యావహారికంలో రచించటం విశేషం. ఆకట్టుకొనే శైలి, మనస్వీత, అరమరికలు లేని వాత్సల్య సౌగంధ్యం ఆయన స్వీయ జీవితాన్ని విభూషితం చేస్తున్నాయి ఆనాటి పండితులు, ఉభయ గోదావరి జిల్లాలలోని సాంఘిక జీవనం, సాంస్కృతిక విశేషాలు, ఆనాటి పల్లెటూళ్ళలోని అకృత్రిమ జీవనం వేంకటరమణశాస్త్రిగారు హృద్యంగా వచనగీతంలాగా స్వీయ చరిత్రాత్మకంగా చేశారు.

స్వామీ జ్ఞానానంద స్వీయ చరిత్ర 1971వ సంవత్సరంలో వెలువడింది. అన్నివిధాల యీ స్వీయ చరిత్ర నిరుపమానమైనది. జ్ఞాన విజ్ఞాన సమ్యగ్ సమన్వయ మూర్తిమంతం స్వామి వారిది. ఆధ్యాత్మిక గవేషణతో ఇల్లు విడిచి హిమాలయపర్వత కందరారణ్యసీమల్లో కఠోరమైన తపస్సుచేసి అవధూతస్థితికి చేరుకొని, సర్వ అధ్యాత్మికపథ సమన్వయం చేసి, యోగశాస్త్రాన్ని సుగమం చేసి ఇంగ్లీషులో అత్యుత్తమ గ్రంథం రచించిన మహానుభావులు స్వామి జ్ఞానానంద. 1896వ సంవత్సరంలో జన్మించి 1969లో నిర్యాణం చెందిన స్వామి వారి జీవిత వృత్తాంతం అత్యంతాద్భుతమైనది. ఇరవై సంవత్సరాల వయసున వీరు ఇల్లు విడిచి తపోసాధన తత్పరత్వంతో హిమాలయాలకు వెళ్ళారు. పది సంవత్సరాలు తీవ్రమైన సాధనలు సల్పిన తర్వాత తమ గ్రంథాలు అచ్చు వేయించాలనే సంకల్పంతో జర్మనీకి వెళ్ళారు. మెట్రిక్యులేషన్ పరీక్షతో ఆపి వేసిన చదువును జర్మనీలో పునఃప్రారంభించి అంతర్జాతీయ విఖ్యాత శాస్త్రవేత్తగా పేరుగాంచారు. జెకోస్లోవేకియా నుంచి డి.ఎస్సి.ని, లండన్‌లో లివర్‌పూల్ విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి.ని, అంతర్జాతీయ భౌతిక విజ్ఞాన సంస్థ గౌరవ సభ్యత్వాన్ని, అమెరికాలోని పరమాణు విజ్ఞాన పరిశోధనల అత్యంత గౌరవప్రద సభ్యత్వాన్ని పొందారు. ఇటు పరివ్రాజకత్వంలోనూ, అటు విజ్ఞాన శాస్త్రవేత్తగానూ స్వామి జ్ఞానానంద అత్యున్నతమైన శిఖరాగ్రాలు అధిరోహించడం అపూర్వం, అద్భుతం. భారతదేశ స్వాతంత్ర్యోదయం తరువాత జాతీయ భౌతిక విజ్ఞానశాస్త్ర ప్రయోగసంస్థలో ఉన్నతాధికారిగా స్వామివారు అణుభౌతిక విజ్ఞాన ప్రయోగాలెన్నో నిర్వహించారు. ఆటుతర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయములో అణుభౌతిక విజ్ఞానశాస్త్ర పరమాచార్యులుగా ఆ విభాగానికి రూపకల్పన చేశారు. స్వామి జ్ఞానానంద పరమాణు భౌతికశాస్త్రంలో శతాధికంగా ప్రామాణికమైన ప్రయోగాలు చేశారు. ఆ ప్రయోగాలు పరమాణు భౌతికశాస్త్ర విద్యార్థులకు పాఠ్యపుస్తకాలుగా దేశ విదేశాలలో ఉపయుక్తమవుతున్నాయి. వారివద్ద ఇరవై అయిదు మంది వరకు పరిశోధనలు జరిపి పరిశోధక పట్టాలు పొందటమేకాక దేశ విదేశాలలో మంచి గుర్తింపు కూడా పొందారు. ఉభయ విజ్ఞానాన్ని, పరా అపరా ప్రకృతులను స్వామివారు సాధించటం, ఇటువంటి అపూర్వ సమ్మేళనం కని విని ఎరుగనిది. స్వామివారి పూర్వాశ్రమ నామం భూపతిరాజు లక్ష్మీనరసింహరాజు. వీరిది పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం సమీపస్థమైన గ్రామం

గొరగనమూడి. స్వామి జ్ఞానానంద యతిచంద్రులు తెలుగులో స్వీయ చరిత్ర సంకల్పించటం తెలుగువారి అదృష్టం.

ఇటీవల వెలువడ్డ స్వీయ చరిత్రలలో డా. ఉప్పల లక్ష్మణరావు గారి బతుకు పుస్తకం పేర్కొనదగినది. డా. లక్ష్మణరావు గారు తెలుగుదేశంలో వీరేశలింగ యుగానంతరం సాంఘిక, సామాజిక భావ పరివర్తనలను స్వీయ చరిత్రలో ప్రసక్తం చేశారు. ఇంగ్లండులో, జర్మనీలో, రష్యాలో ఉన్నత విద్యాభ్యాసం నిమిత్తమూ, సామాజికోద్యమ అధ్యయనం నిమిత్తమూ వారు ఉన్నారు. జాతీయోద్యమ స్ఫోరకమైన రచనలు చేశారు. లక్ష్మణరావు గారు రచించిన అతడు-ఆమె ఈ శతాబ్ది ఉత్తమ తెలుగు నవలలో ఒకటి. ✗ - తెలుగు నిఘంటువును కూర్చిన ప్రతిభాశాలి శ్రీ లక్ష్మణరావు. వారి స్వస్థలం బరంపురం. ఈ శతాబ్ది ప్రథమ దశకాలలో ఉత్తరాంధ్రంలోని సాంఘిక సంస్కరణ ఉద్యమాలు, భాషా సారస్వత ఉద్యమాలు, వామపక్ష చైతన్య ధోరణుల ప్రభావం, జాతీయోద్యమ స్వరూప స్వభావాలను లక్ష్మణరావుగారి బతుకు పుస్తకం ఒక నవలలాగా చదివిస్తుంది. 1983 వ సంవత్సరంలో వెలువడ్డ యీ స్వీయ చరిత్ర ఇప్పటివరకు వచ్చిన తెలుగు స్వీయ చరిత్రలలో అత్యంతాధునికమైనది. వస్తువు, రచన, అనుభవాల దృష్ట్యా కూడా విలక్షణమైనది.

తెల్లాకుల జాలయ్యగారనే వణిక్ప్రముఖుడు కూడా స్వీయ జీవితానుభవాలు గ్రంథస్థం చేశారు. వీరిది గుంటూరు స్వస్థలం. స్వయం కృషితో వ్యాపార వాణిజ్య రంగంలో ఏ విధంగా ఒక స్థాయికి చేరుకున్నదీ యీ స్వీయ జీవితానుభవాలలో వారు వర్ణించారు.

తెలంగాణాలోని సామాజిక చైతన్యోద్బోధకు సంబంధించిన మందుముల నరసింగరావు స్వీయ చరిత్ర '50 సం॥ ల హైదరాబాదు' ఈ మధ్యనే వెలువడింది. తెలంగాణ స్వాతంత్ర్యోద్యమంలో నరసింగరావుగారు ప్రముఖ పాత్ర వహించారు. ఉర్దూ పత్రికలకు సంపాదకులుగా జాతీయ చైతన్య ప్రబోధం చేశారు.

ఇటీవలనే శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి 50 సం॥ల జ్ఞాపకాలు అనే స్వీయ చరిత్రాత్మక గ్రంథం వెలువడింది. భాషా సారస్వత రంగాలలో, విద్యావ్యాపన రంగంలో శ్రీ రామానుజరావుగారు ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యక్రమాల ద్వారా తెలంగాణ ప్రజలను జాగృతం చేశారు. వారు సన్నిహితంగా ఎరిగిన విశిష్ట వ్యక్తిత్వాలను గూర్చి ఆకర్షణీయమైన సంఘటనలను, సన్నివేశాలను ఈ గ్రంథం ద్వారా జ్ఞాపకం చేసుకున్నారు.

స్వీయ చరిత్ర ప్రక్రియకు సంబంధించిన అనుభవాలను, జ్ఞాపకాలను, స్మృతులను ప్రకటించిన మహిళలు కూడా కొందరున్నారు. సంగెం లక్ష్మీ బాయమ్మగారు 'నా అనుభవములు' అనే పేరుతో స్వీయ జీవిత ఘట్టాలను ఒక చిన్న పుస్తకంగా 1962 వ సం॥ లోనే వెలువరించారు. ఈమె సుప్రసిద్ధ సంఘ సేవకురాలు. సంస్థా నిర్మాత్రి. తాము చదువుకున్న శారదా నికేతనం గూర్చి, క్వీన్ మేరీస్ కళాశాలను గూర్చి, నాటి తారుణ్య జీవితాన్ని గూర్చి ఆసక్తికర మైన స్మృతులు యీ పుస్తకంలో ఉన్నాయి. తెలంగాణాలో ఇటీవల విషాద చరిత్రకు సంబంధించిన రజాకారుల దురంతాలు, స్వాతంత్ర్యోద్యమం, హైదరా బాదు నగరంలో రాజకీయ చైతన్యం మొదలైన సంగతులు కూడా జ్ఞాపకాలుగా అక్షర రూపం కల్పించారు.

బసవరాజు రాజ్యలక్ష్మమ్మగారి 'అప్పారావుగారూ - నేను' అనేది స్మృతి గ్రంథం. బసవరాజు అప్పారావుగారితో ముడిపడిన తమ కుటుంబం జీవిత వృత్తాంతం, ఆంధ్ర మహాసభల వృత్తాంతాలు, కవి పండిత మిత్రుల స్నేహాలు, అప్పారావుగారి సున్నిత వ్యక్తిత్వంలకు యీ స్మృతులలో రాజ్యలక్ష్మమ్మ గారు అక్షరాకృతి కల్పించారు.

పద్య కృతులుగా తమ అనుభవాలను, జ్ఞాపకాలను, స్మృతులలో అక్షర బద్ధం చేసిన వారిలో జాషువా; తుమ్మల సీతారామమూర్తి చౌదరి, పెన్మత్స సత్యనారాయణరాజు మొదలైన ప్రముఖులు. ప్రథమ గణ్యులు.

విశ్వనాథ సత్యనారాయణగారి బాల్య కౌమారయౌవన దశా జీవిత విశేష పరిమితమైన ఆత్మకథ ఇటీవలె వెలువడింది. వేయిపడగలంత గ్రంథం వారు స్వీయ చరిత్ర వెలువరించి వుంటే ఈ శతాబ్ది సాహిత్య చరిత్రకు మణిదీపంగా ఉపకరించి ఉండేది.

ప్రతిభా పూర్ణులైన, వివిధ రంగాలలో విశిష్ట వ్యక్తిత్వ సముపేతులైన మహామహులు స్వీయ చరిత్రలు ప్రకటిస్తే జాతి చరిత్రకు మౌలికమైన, పరమ ప్రామాణికమైన ఆధారాల కోసం పరిశ్రమించ నక్కర లేదు.

ఇప్పుడు ప్రముఖ కవి పండితులు శ్రీ దాశరథి కృష్ణమాచార్యులు యాత్రా స్మృతి పేరుతో తమ జీవితానుభవాలు అక్షరం చేస్తున్నారు. ఈ జీవితం ఒక యాత్ర. ఈ యాత్రలో అనేక అనుభవాలు ఎదురవుతాయి. అవి జీవితంపై ప్రసరింప చేయగల ప్రభావాన్ని బట్టి స్మృతులుగా, జ్ఞాపకాలుగా జీవితాన్ని ప్రభావితం చేస్తూనే ఉంటాయి. ముందుతరాల వాళ్ళు వీటిని తెలుసుకోవటం చాలా అవసరం.

# 4. తెలుసుకోవలసిన సంగతులు

స్వీయ చరిత్రలు ప్రత్యక్ష అనుభవాలు, ప్రత్యక్ష కథనాలు కాబట్టి వీటిలో అవాస్తవికమైన విషయాలు, అతి వాస్తవికమైన సంగతులు ఉండవు. అయితే విశిష్టమైన వ్యక్తిత్వాలకు సంబంధించి ఉంటవి కాబట్టి అసాధారణంగా ఉండడం సంభవిస్తుంది. మానవ జీవితంలోని ఔన్నత్యాలు, బలహీనతలు, స్వార్థ ప్రవృత్తి, త్యాగ నిరతి, విచిత్రోదంతాలు స్వీయ చరిత్రలలో కనిపించే అవకాశం వుంది. దీనివల్ల మానవుడు జీవితంలో ఏ పరిస్థితులలో ఏ విధంగా ప్రవర్తిస్తాడో, అట్లా ప్రవర్తించటం సబబవునో కాదో, కష్టాలు వచ్చినప్పుడు వాటిని ఓర్పుగా ఏ విధంగా భరించాలో, జీవితంపట్ల ఆశా అనురాగం, తోటి మానవుడి పట్ల సహనం, దయ ఏ విధంగా అలవరచుకోవాలో ప్రబోధించబడతాయి.

''ఈ విశాల జగతి నుంచి ఏమిటి నే కోరినాను? ఒక దోసెడు సానుభూతి, ఒక జానెడు తీరుబాటు'' అన్నాడు శ్రీశ్రీ. మానవుడు జీవితంపట్ల సరి అయిన దృక్పథాన్ని, ఒక సంస్కారాన్ని అలవరించుకోగలిగితే, లోకానికే కొన్ని విషయాలు నేర్పటానికి అవకాశం ఉంటుంది. మనకు కావలసినవి లోకం నుంచి మనమే తీసుకోగల నిబ్బరము, ధైర్యము, ప్రశాంతత అలవడతాయి. లోక మేమిటో తనను సరిగ్గా అర్థం చేసుకోలేదని గాని, చిన్నచూపు చూసిందనిగాని ఏ విధమైన అసంతృప్తికి లోనుగాకుండా జీవితాన్ని చక్కదిద్దుకునే దృక్పథం మహా పురుషుల జీవిత చరిత్రలు, ముఖ్యంగా స్వీయ చరిత్రలు బోధిస్తాయి.

మహా భారతంలో ధర్మరాజు తమ్ములతో, భార్యతో అరణ్యవాసానికి బయలుదేరి వెళ్ళేటప్పుడు హస్తినాపురం ప్రజలు ఆయనతో ఇట్లా అంటారు: ''మేము మీరు లేకుండా ఇక్కడ ఉండలేము. మీతో వస్తాం. ఎందుకంటారా, నువ్వులు, నీళ్ళు, వస్త్రాలు పువ్వులతో కూడినప్పుడు, ఆ పూల సువాసనను అవి కూడా పొందుతాయి. కాబట్టి జీవితంలో అన్నిటి కన్నా ముఖ్యం సత్సంగం. అందువల్ల కొన్ని అయినా సద్గుణాలు అలవడతాయి'' అన్నారు వాళ్ళు. మంచి పుస్తకాలు చదవటం వల్ల కూడా జీవితం పట్ల ఒక బాధ్యతతో కూడిన దృక్పథం ఏర్పడుతుంది.

అరణ్యవాసం చేస్తున్న ధర్మరాజు దగ్గరకు బృహదశ్వుడనే ముని వచ్చాడు. ఆయన యీయన కుశలవార్త లడిగి ఆశీర్వదించాడు. అప్పుడు ధర్మరాజు తమ కెటువంటి అన్యాయం జరిగిందో, అధర్మపరులయిన పరులు ఏ విధమైన అపకారం చేశారో చెపుతూ ఊరుకోక, మాలాగా కష్టాలు పడ్డ వాళ్ళు భూమి మీద ఎవరైనా ఉన్నారా? అన్నాడు. మానవుడిలో బలహీనత ఇది. చిన్న కష్టం వచ్చినా, పెద్ద కష్టం వచ్చినా ప్రపంచంలో అటువంటి బాధలు ఇక ఎవరికీ రాలేదని తమ నుదుటనే రాసి పెట్టి ఉన్నాయనీ అనుకుంటారు. వారికీ వీరికీ చెప్పుకుంటారు.

ధర్మరాజు అన్నాడు: ఇల్లూ వాకిలీ విడిచిపెట్టాం, మా రాజ్యం పోగొట్టుకున్నాం, బంధువులందరినీ దూరం చేసుకున్నాం, జంతువులలో కలసిపోయాం, అడవుల పాలైనాం, మాలాగా ఇన్ని కష్టాలు పడినవాళ్ళు అసలు ఎవరైన ఉంటారా? అన్నాడాయన. అప్పుడు ఆ వచ్చిన బృహదశ్వుడు ధర్మరాజుతో అన్నాడు కదా, ఓ ధర్మరాజా! నీ తమ్ముళ్ళు దేవతా సమానులు. అదీగాక నీకు మంచీ చెడ్డా చెప్పటానికి నీతో కొందరు ఆచార్యవర్యులూ వచ్చారు. రథాల మీద వచ్చారు మీరు అడవికి. పందెంలో రాజ్యం పోయింది కాని, నీకు రాజ్యం వుంది. మళ్ళీ వచ్చే అవకాశం వుంది. నీ కష్టం ఒక కష్టం కాదయ్యా, నలమహారాజు పడిన కష్టాలముందు అన్నాడాయన. సరే, ఇక తర్వాత నల చరిత్ర వినిపించాడు ధర్మరాజంతటి వాడికే యీ మనస్థితి తప్పనప్పుడు సామాన్య మానవుల మాట ఏమిటి? నలుడి కథ, సత్యవంతుడి కథ, శ్రీరాముడి కథ, ఆయన దగ్గరకు వచ్చిన మునులు చెప్పారు. లోకంలో జరిగే విషయాలు ఆయనకు అర్థమై ఉంటాయి.

లోకాన్ని బాగా తెలుసుకోవటానికే గ్రంథాలు అవసరం. ఆశయం కూడాను. కవి ప్రతిభతో ఆయా ఘట్టాలు, సన్నివేశాలు సృష్టించినవి కాకుండా స్వయంగా అనుభవించి వాటిని అక్షరబద్ధం చేస్తున్నప్పుడు, చదివే వారికి అవి మరింత ఆకర్షణీయమూ, విశ్వసనీయమూ కావటంలో వింత ఏముంది?

జీవితంపట్ల ఒక తాత్త్వికదృక్పథం, జీవిత పరమార్థం ఇవన్నీ బోధించటానికి మతం, తత్త్వశాస్త్రం, నీతిశాస్త్రం, ఇవన్నీ ఉన్నాయి కదా, స్వీయ చరిత్రలు, సాహిత్యం ద్వారా వీటిని తెలుసుకోవాల్సిన అగత్యముందా అనుకోరాదు. వాటి పరిధి వేరు, సాహిత్యం ప్రభావం వేరు. లోకంలో ఆసక్తిని కలిగించేవీ, తెలుసుకోవలసినవీ అయిన విషయాలను వ్యక్తి స్వయంగా వెళ్ళి చూసి

తెలుసుకోవటం అసాధ్యం, అసంభవం. జీవితకాలం చాలదు. కాబట్టి లోకంలో ఆసక్తి కలిగించే విషయాలు, మతం, చరిత్ర, సాంఘిక జీవనం, సంస్కృతి, మొదలైనవి తెలుసుకోవాలన్నా, సాంఘిక పరిణామాలు ఏయే శక్తుల నాధారం చేసుకొని ఏయే దశలలో ఏర్పడుతున్నాయన్న విషయం తెలుసుకోవటానికైనా కిందటి తరాలవారి జీవితానుభవాలు తెలుసుకోవటం అవసరం. సామాజిక పరిణామాలు, చారిత్రక సంఘటనల కోసం అధ్యయనం చేయకపోయినా మానవ జీవితంలో విచిత్రమైన, అపరూపమైన, అద్భుతమైన ప్రవృత్తులు తెలుసుకోవటానికైనా స్వీయ చరిత్రలు చదవవచ్చు.

యేనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్రను చదివితే నూట ఏభై సంవత్సరాల కిందట రాజకీయ సాంఘిక శక్తులు ఏ విధంగా ఉండేవో తెలుస్తుంది. 1835 వ సంవత్సరంలో వీరాస్వామయ్యగారు పదవీ విరమణ చేశారు. 1819 లో సుప్రీమ్‌కోర్టులో ఇంటర్‌ప్రిటర్ ఉద్యోగంలో చేరారు. అంతకు పూర్వం ఆయన ఈస్టిండియా కంపెనీవారి వాణిజ్య సంఘ కార్యాలయంలో పనిచేశారు. వీరాస్వామయ్యగారు వాణిజ్య కార్యాలయంలో గణకుడిగా పని మానుకొని సుప్రీంకోర్టులో చేరుతున్న సందర్భంలో ఆయన విశిష్ట సేవలకుగాను బంగారు ముక్కు పొడుం డబ్బీ ఆయనకు వాణిజ్యకార్యాలయంవారు బహూకరించారుట. వీరాస్వామయ్య కాశీయాత్రా చరిత్రకు తొలిపలుకు వ్రాసిన కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ళగారు యీ విషయం వ్రాశారు. అప్పటికి వీరాస్వామయ్యగారికి 40 సం॥ల వయసు కూడా లేదు. ఒక వ్యక్తి స్వయంకృషి వల్ల, చిత్తశుద్ధి, నిజాయతీలవల్ల తోటివారి ఘన గౌరవాదరాలకు ఎంతగా పాత్రుడు కాగలరో ఇందువల్ల తెలుసుకోవచ్చు.

ఇటువంటిదే ఆనాటి సంఘ వ్యవస్థలో, ఆధికారిక వ్యవస్థలో ఇంకొక చిత్రమైన సంఘటన. వీరాస్వామయ్యగారు తిరువణ్ణామలకు వెళ్ళినప్పుడు అక్కడి యూరోపియన్ కలెక్టరు మీవంటి పెద్దలంతా కలిసి పూనుకొని ఈ దేవాలయానికి ఒక రథం నిర్మింపచేయాలని కోరారుట. యూరోపియన్ కలెక్టర్ హిందూ దేవాలయానికి జరిగే రథోత్సవంపట్ల ఆసక్తి చూపడం వింతకదా! ఈస్టిండియా కంపెనీ వారు అధికారంలోకి వచ్చిన తర్వాత సుమారు నాలుగు దశాబ్దాల ధర్మాదాయ దేవాదాయ నిర్వహణ అంతా కలెక్టరుల ద్వారానే జరిపించటం కూడా వింతయిన విషయమే. ఇంచుమించుగా 1840 వ సంవత్సరం వరకు తిరుపతి

దేవస్థానం పరిపాలన అంతా చిత్తూరు కలెక్టరే నిర్వహించేవారు. ఆ రోజుల్లో తిరుపతి దేవాలయం నుంచి కంపెనీకి సాలుకు లక్ష రూపాయలు లాభం వచ్చేది. అర్చనలు, తక్కిన దేవాలయ పరిపాలనా ఖర్చులు పోను లక్ష రూపాయలు నికరాదాయం కంపెనీ వారు పొందడం వింతలలో వింత.

అహోబలం నరసింహస్వామికి ఫాల్గుణ మాసంలో జరిగే తిరణాలకు యాత్రీకుల నుంచి పన్ను వసూలుచేసి నాలుగైదు వందల వరహాలు కందనూరు నవాబు గుటుక్కున మింగేసేవాడు కాని, దేవాలయం స్థితిని ఏ మాత్రమూ పట్టించుకొనేవాడు కాడని వీరాస్వామయ్యగారు వ్రాశారు.

వీరాస్వామయ్యగారు కాశీని దర్శించినప్పుడు ఆనాటి కాశీ పట్టణం, జన సంఖ్య, అక్కడి వీధులు, అక్కడి జనుల ఆచారాలు, దేవాలయాలలో అర్చా విధులు అన్నీ వివరంగా వ్రాశారు. నూటఏభై సంవత్సరాల క్రిందటి యీ విషయాలు ఇవాళ చాలా ఆసక్తిని కలిగిస్తాయి. బిషప్ హెబర్ అనే క్రైస్తవ మతాచార్యుడు 1824 వ సంవత్సరంలో కాశీ నగరాన్ని దర్శించినప్పుడు యూరోపుఖండంలోనూ, ప్రపంచంలోనూ ఒక్క లండన్, పారిస్ నగరాలను మినహాయించి, ఇంత పెద్ద పట్టణం, ఇంత జన సంఖ్య మరే పట్టణంలోనూ లేవని వ్రాశారని కాశీయాత్ర చరిత్రకు తర్జుమా వ్రాసిన దిగవల్లి వేంకట శివరావు పంతులుగారు వ్రాశారు. కాబట్టి శతాబ్దుల సాంఘిక చరిత్రకు జీవిత చరిత్ర, స్వీయ చరిత్రలు ఎంత సహాయకారులో తెలుసుకోవచ్చు. వీరాస్వామయ్యగారు 1810 లో ఒకసారి, 1830 లో ఒకసారి హైదరాబాదుకు వచ్చారు. రెండోసారి వచ్చినప్పుడు ఆయన కాశీయాత్రకు వెళుతూ మార్గంలో హైదరాబాదులో కొన్నాళ్ళు విడిదిచేశారు. అప్పటి హైదరాబాదులోని సాంఘిక జీవనం, దివాన్ చందూలాల్ పరిపాలన విశేషాలు వర్ణించారు. చాలా వింత సంగతులున్నాయి.

ఇదే విధంగా వీరాస్వామయ్య సమకాలికులే అయిన వెన్నెలకంటి సుబ్బారావుగారి జీవయాత్రా చరిత్రలో కూడా నూటఏభై సంవత్సరాలనాటి చారిత్రక విశేషాలెన్నో పొందుపరచబడినాయి. ఫ్రెంచి గవర్నర్ డూప్లే వద్ద ద్విభాషిగా పనిచేసిన ఆనందరంగంపిళ్ళే మహాభవనం పుదుచ్చేరిలో ఉండేది. ఈ భవనం సింహద్వారానికి బంగారు మలామా ఉండేదనీ, దాన్ని స్వయంగా తాము చూశామనీ సుబ్బారావు పంతులు జీవయాత్రా చరిత్రలో వ్రాశారు. ఆనాడు ఆయన ఇటు కాశీయాత్ర ఒకసారీ, అటు రామేశ్వరయాత్ర మరొకసారీ చేసి, మార్గ

మధ్యంలోని విశేషాలన్నిటినీ గ్రంథస్థం చేశారు. ఆనాటి సత్రాలు, రక్షణవ్యవస్థ, చదువులు, కోర్టులు, ప్రకృతి బీభత్సాలు, ప్రయాణ సౌకర్యాలు, సాంఘికపు కట్టుబాట్లు, నమ్మకాలు ఇవాళ్టికీ చాలా కుతూహలకరంగా ఉంటాయి.

అప్పుడప్పుడే ఇంగ్లీషు చదువులు, ఇంగ్లీషువారి సంస్కృతి, సాంఘికాభిప్రాయాలు, మనదేశంలో కొత్తదైన భావసంచలనం కలిగిస్తున్న రోజులవి. ఇంకా చెదురుమదురుగా సతీసహగమనాలు, పిండారీల బందిపోట్లు కూడా జరుగుతూనే ఉన్నాయి. ఇటువంటి సతీసహగమనాన్ని గూర్చి వెన్నెలకంటి సుబ్బారావుగారి జీవయాత్రా చరిత్రలో ప్రసక్తి ఉంది. ఆనాటి భారతదేశపు సర్వేయర్ జనరల్ కల్నల్ కాలిన్ మెకంజీ దగ్గర చరిత్ర పరిశోధకుడిగా, చారిత్రకాధార సేకరణ కర్తగా, ద్విభాషిగా ఉంటున్న కావలి లక్ష్మయ్యగారింట్లో కలకత్తాలో పదిరోజులు గడిపినట్లు వెన్నెలకంటివారు స్వీయ చరిత్రలో వ్రాసుకున్నారు. లక్ష్మయ్యగారి సోదరుడు రామస్వామి దక్షిణ భారతదేశ కవుల జీవిత చరిత్రను ఇంగ్లీషులో వెలువరించటం, దేశంలో ఇంగ్లీషు భాష పట్ల మేధావులలో అప్పటికే ఎటువంటి ఆకర్షణ ప్రబలిందో తెలియచేస్తుంది. ఆనాటి విద్యావంతుల్లో, మేధావుల్లో, సాంఘిక అగ్రస్తర జీవనం చేసేవారిలో ఇంగ్లీషువారి పరిపాలన పద్ధతులు, న్యాయవ్యవస్థ, నాగరికతపట్ల బాగా అభిమానమూ, మక్కువ ఉండేవని, దానితో పాటుగానే తమ సంస్కృతి, నాగరికత, మత నైతిక వ్యవస్థలలో వచ్చిన అవాంఛనీయమైన పరిణామాల పట్ల పరితాపం ఉండేదని వీరాస్వామయ్య, సుబ్బారావుల స్వీయానుభవాల ప్రసక్తినిబట్టి తెలుసుకోవచ్చు. ఆ కాలంలో మంత్రశాస్త్రం, దైవారాధనలు, పుణ్యక్షేత్ర యాత్రలు, యాత్రికుల వసతికై దానధర్మాలు చెయ్యటం, వీటి పట్ల సంఘంలో నిండు ప్రవృత్తి కనపడుతున్న విషయం ఆనాటి చరిత్రలవల్ల తెలుస్తున్నది. ఆ కాలంలో కాశీలో ప్రతినెలా నాలుగైదు లక్షలు దానధర్మాలు, సంతర్పణలు, శాస్త్రార్థాలు, విద్వత్సమ్మానాల నిమిత్తం ఖర్చుచేయగల శ్రీమంతులెవరో సంవత్సరం పొడుగునా ఉంటూనే ఉండేవారని వీరాస్వామయ్యగారు వ్రాశారు.

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు తమ ఆరవై సంవత్సరాల జీవితానుభవాలను శతకించిన హరిహరేశ్వర శతకంలోనూ, బొబ్బిలిరాజావారితో కలిసి యాత్ర చేసిన సందర్భంగానూ, ఆనాటి సాంఘిక విశ్వాసాలనుగూర్చి, ప్రయాణ సౌకర్యాలను గూర్చి వ్రాశారు. ఉత్కృష్టుడైన ఒక మహా విద్వాంసుడు తనకు

వాగ్వాదినీ మంత్రోపదేశం చేశారనీ, ఆనాటినుంచి తనలో కవిత్వం పెల్లుబికిం దనీ పార్వతీశ్వరశాస్త్రిగారు వ్రాసుకొన్నారు. మంత్రాలకు చింతకాయలు రాలక పోయినా, ఎనభై నాలుగు గ్రంథాలు వ్రాయగల శక్తీ, ఆశువుగా వందలకొద్దీ పాదాలు చెప్పగల మాలికారచన సామర్థ్యమూ, తనకు దైవభక్తి, మంత్రపున శ్చరణంవల్లనే కలిగాయని ఆ మహానుభావుని విశ్వాసం కొక్కొండ వెంకట రత్నం పంతులుగారికీ, వేదం వేంకట్రాయశాస్త్రిగారికీ వచ్చిన సాహిత్య వివాదాల పట్ల పార్వతీశ్వరశాస్త్రిగారు నొచ్చుకున్నారు.

వీరేశలింగం పంతులు స్వీయచరిత్రలో సమకాలీన సమాజం ప్రతిబింబిత మైనంతగా సాంస్కృతిక వారసత్వం ప్రతిఫలించదు. ఆనాటి సంఘంలోని దయనీయమైన వ్యవస్థను మార్చటానికి ఆయన జీవిత కాలమంతా పోరాటం సాగించాడు కాబట్టి, ఆనాటి స్వార్థపరత, అజ్ఞానం, సంఘంలోని బలవత్తరమైన దుష్టశక్తులు, మోసాలు, కపటాలు విపులంగా ప్రస్తావించాడు. మానవ జీవితం లోని సాహసం, త్యాగనిరతి, ఆర్ద్ర మనస్కత వీరేశలింగం స్వీయ చరిత్రను ఒక నవలకన్నా ఎక్కువ ఆకర్షకంగా చదివింపచేస్తాయి. ఆయన మహా ప్రతిభా వంతుడు, సృజనాత్మక శక్తిమంతుడు కాబట్టి స్వీయ చరిత్రను అత్యంత సుంద రంగా చెప్పగలిగాడు.

రాంభొట్ల జగన్నాథశాస్త్రి గారి స్వీయ చారిత్రంలో మానవ జీవితంలోని సహజ ప్రవృత్తుల గాంభీర్యం ప్రతిభావంతంగా చిత్రణం పొందింది. ఎంతో పేదరికం నుంచి పెద్దరికానికి ఎదిగిన మహనీయు డీయన. వేదం వేంకట్రాయ శాస్త్రిగారి తండ్రి వేంకటరమణశాస్త్రి గారు విశాఖపట్నంలో ఒక మిషన్ స్కూల్లో పనిచేసేవారనీ, ఆయన వద్ద జగన్నాథశాస్త్రి గారు చదువుకున్నారని, వేంకట రమణశాస్త్రి గారు నియమనిష్ఠలతో స్వతంత్రంగా జీవించేవారని, ఆత్మగౌరవానికి ఏమాత్రం వ్యతిక్రమం కలగకుండా జీవితం గడుపుకునేవారని జగన్నాథశాస్త్రి గారి అనుభవాలవల్ల తెలుస్తుంది.

పల్లూరి సూర్యనారాయణరావు గారి స్వీయ చరిత్రవల్ల తెలుగువారి వాణిజ్యరంగ ప్రతిభ తెలుస్తున్నది. రెంటాల వేంకట సుబ్బారావు అనే మహా మేధావి దక్షిణ భారతదేశంలో గొప్ప మందుల సంస్థను స్థాపించి, విరివిగా ప్రక టన చేసి చాలా డబ్బు సంపాదించాడు. కళాశాల తరగతులకు పాఠ్య పుస్తక సహాయకులుగా ఆయన ఎన్నో పుస్తకాలు రచించి విశేష విత్తం ఆర్జించాడు.

ఒక్క స్కాట్లండ్‌లో తప్ప ప్రపంచంలో ఎక్కడా అంత పెద్ద ఫుటోస్టుడియో లేదు అనిపించుకోగలిగిన ఫుటో స్టూడియోను మద్రాసులో స్థాపించి, భారతీయ సామాజిక జీవన సంబంధమైన ఛాయా చిత్రాలను తయారు చేసి ప్రపంచదేశాల మార్కెట్‌ను ఆకర్షించిన మేధావి రెంటాల వేంకట సుబ్బారావు. విద్యారంగంలో కూడా ప్రధానోపాధ్యాయ పదవిని చేపట్టినప్పుడు యూరోపియన్‌లతో సరిసమాన మైన వేతనాన్ని ఆయన తీసుకున్నాడు. ఈ విషయాలన్నీ సూర్యనారాయణరావు స్వీయచరిత్ర నమోదు చేసింది. బలభద్ర కోటయ్యగారి స్వీయ చరిత్రవల్ల మద్రాసు, బందరు, రాజమండ్రి వంటి పట్టణాలలోనేకాక తెలుగునాట జిల్లా ప్రాంతాల కూడా కొంచెం చదువు సంధ్యలభ్యసించిన వారు బ్రహ్మసమాజం వల్ల ఎట్లా ప్రభావితులైనారో తెలుస్తున్నది. రాయసం వెంకటశివుడు స్వీయ చరిత్రవల్ల ఆనాటి ప్రముఖుల వ్యక్తిగతమైన పట్టుదలలు, లోపాలు, మానవ సహజమైన అతిశయాలు తెలుస్తున్నాయి.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు, కస్తూరి శివశంకర కవిగారు ఆంధ్ర సర్వస్వంలో తమ జీవితానుభవాలు ప్రకటించారు. ఆ రోజుల్లో తరతరాల వారు చెప్పుకొనే కుటుంబ గాథలు కొన్ని ఉండేవి. తమ ఇంట్లో ఏదైనా వివాహం జరిగే సందర్భంలో ముందుగా ఒక హరిజనుడి వివాహం జరపటం తరతరాల కట్టడి అంటూ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రస్తావించారు. ఇది తరతరాల ఆనవాయితీగా వంశాచారంగా అనుసరిస్తూ వస్తున్న ఒక నమ్మకం.

కస్తూరి శివశంకర కవిగారి స్వీయ చరిత్రలో చాలా ఆశ్చర్యకరమైన విషయం ఒకటుంది. లోకంలో మామూలుగా గొప్పవారెవరైనా స్వీయ చరిత్ర రాస్తే అందులో తమ విశిష్ట వ్యక్తిత్వం, తామెరిగిన ప్రజ్ఞాశాలురు, విలక్షణ వ్యక్తులు, వాళ్ళ గూర్చిన విశేషాలు వ్రాస్తారు. కాని శివశంకర కవిగారు తమ పొలం పనులు చేసినవాళ్ళనుగూర్చి, తమ ఇంట్లో శరీర కష్టంచేసిన వాళ్ళను గూర్చికూడా స్మరించారు. ఇంతేకాకుండా ఇంకో ముఖ్యమైన విషయం ఉంది. ఆ రోజుల్లో అంటే ముఖ్యంగా కిందటి శతాబ్ది చివరిపాదం యీ శతాబ్ది మొదటి పాదంలో ఉభయ గోదావరి జిల్లాలలో ముఖ్యంగా పిఠాపురం, కాకినాడ ప్రాంతా లలో మహమ్మద్ మొహియుద్దీన్ భాషా వారనే ఒక ముస్లిం మత గురువుల పీఠమూ, దానికి ఒక ఆధ్యాత్మిక శిష్యకూటమూ ఉండేది. చాలా మంది హిందు వులు కూడా యీ పీఠంవారికి శిష్యులుగా ఉండేవారు. హిందూమతంలో అద్వైత సంప్రదాయానికి పోలికలున్న సూఫీ సంప్రదాయానికి చేరుపైనదీ సంప్రదాయం.

కస్తూరి శివశంకరకవిగారిది అమలాపురం దగ్గర ఉన్న ఇందుపల్లి స్వస్థలం. వారి మతామహులు గొప్ప ఉపాసకులు. వారు కూచిమంచివారు. ఆయన పేర్రాజుగారు. ఆయన్ను జపాల పేర్రాజు గారనే వారని, ఆయనకు దివ్యదర్శనాలు కలిగాయని శివశంకర కవిగారు వర్ణించారు. అన్నిటికంటే వారు సాంఖ్య సంప్రదాయాన్ని ఒక ముస్లిం పండితులవద్ద అధ్యయనం చేశామని చెప్పటం చాలా అద్భుత వృత్తాంతం. ఆయనిట్లా వ్రాశారు : "యోగులగునట్టియు విదిత సకల నిగమరహస్యార్థము గలిగినట్టియు శ్రీ గులాం ఖాదరుగారు నాకు సాంఖ్యాధ్యాచార్యులును, బ్రహ్మ విద్యా సహాయులును." సంస్కృతంలో గొప్ప విద్వత్తు సంపాదించిన ముస్లిములు ఉన్నట్లు వింటాం కాని, యోగ రహస్యాలు, వేదవిజ్ఞానంపట్ల ఆసక్తి చూపి సాధించిన వారు గులాం ఖాదర్ మహాశయులు. కస్తూరి శివశంకర కవిగారు ఆయన్ను చరితార్థుణ్ణి చేశారు. ప్రకాశం పంతులు, చిలకమర్తి స్వీయ చరిత్రల వల్ల ఆనాటి సాంఘిక జీవితం, ఇంగ్లీషు విద్యలు, ఇంగ్లీషు సామాజిక వ్యవస్థ సమకాలిక సంఘ జీవితాన్ని ఏ విధంగా ప్రభావితం చేస్తున్నదీ ప్రత్యక్షకథనంగా తెలుసుకోవచ్చు. నాటి గురుశిష్య సంబంధాలు, నాటక సమాజాలు, కండబలం కలవాళ్ళ కావరాలు మొదలైనవి ఆసక్తి కలిగిస్తాయి. ఏలూరులో రత్నకంబళాలు నేయటం తాము స్వయంగా చూశామని, తమ గురువుగారు ఇమ్మానేని హనుమంత రావు నాయుడుగారు వాటిని తమకు చూపారని ప్రకాశం వ్రాశారు. ఇటీవల వెలువడ్డ లింగం వీరభద్రయ్యగారి స్వవిషయం స్వీయ చరిత్రలోకూడా ఏలూరు రత్నకంబళ్ళ విలువ, సొగసును గూర్చిన ప్రసక్తివచ్చింది. కేంద్ర మంత్రిపదవి, ఆర్థికశాఖలో ప్రముఖమైన బాధ్యతలు నిర్వహించి, ప్రముఖ పారిశ్రామికులుగా గుర్తింపుపొందిన టి. టి. కృష్ణమాచారిగారి ఇంట్లో ఒక చక్కని రత్నకంబళి చూశామనీ, దానిగూర్చి తెలుసుకోగోరగా, అది ఏలూరునుంచి సంపాదించామని, ఒక అమెరికన్ ఎవరో 5 వేల రూపాయలు ఇస్తాను తనకు అమ్మవలసిందనికోరినా తాను ఇష్టపడలేదని కృష్ణమాచారి చెప్పినట్లు వీరభద్రయ్యగారు స్వవిషయంలో ఉట్టంకించారు. సుమారు శతాబ్దం కిందట ప్రయాణ సౌకర్యాలు చాలా వింతగా కనపడతాయి యీ కాలం వారికి. ప్రకాశం స్వీయచరిత్రలో ఒంగోలునుంచి రాజమండ్రికి అంచెబండ్లమీద ప్రయాణం 15 రోజులు పట్టిందనటం, బెజవాడ నుంచి బందరుకు ఒకరోజు కాలములో పడవప్రయాణం చేశామని కొండ వెంకటప్పయ్యగారు వ్రాయటం నాటి ప్రయాణ సౌకర్యాల వివరాలు. వెన్నెలకంటి సుబ్బారావుగారు మద్రాసు వదలిపెట్టి మజిలీలు చేసుకుంటూ ఐదు రోజులకు

నెల్లూరు చేరామని జీవయాత్రా చరిత్రలో ఉట్టంకించారు. కె ఎన్. కేసరి 'నా చిన్న నాటి ముచ్చట్ల'లో ఒక శతాబ్దం కింద చెన్నపట్నంలోని ప్రముఖులు, వ్యాపార వాణిజ్య రంగాలు, విద్యా సంస్థలు, అధ్యాపకులు, దాన ధర్మ సంస్థలుగూర్చి చాలా కుతూహలం కలిగించే విషయాలు వ్రాశారు. తంజావూరు రామనాయుడి పేర అన్న సత్రం వొకటి చెన్నపట్నంలో ఆ రోజుల్లో ఉండేది. ఈ అన్న సత్రం నడపటానికి వారి పూర్వీకులు వ్రాసి ఇచ్చిన దానపత్రం ఉదాహరించారు కేసరి స్వీయ చరిత్రలో. క్రిస్టియన్ కాలేజి ప్రిన్సిపాల్ డా॥ మిల్లర్ దొరను గూర్చి వ్రాస్తూ కణ్వ, కణాద, గౌతములు వంటి మహర్షి ఆయన అని కేసరి ప్రస్తుతించారు.

దర్శి చెంచయ్యగారి స్వీయ చరిత్ర ద్వారా జితేంద్రనాథలాహిరి, లాలా హరదయాళ్ వంటి గదర్ వీరుల అద్భుత సాహసోపేతమైన త్యాగ జీవితంలో ఉజ్జ్వల గాథలు తెలుస్తాయి. ఖుదీరాంబోస్ దేశభక్తిని గూర్చిన ఉదంతం భావోజ్జ్వలంగా చిత్రించారు చెంచయ్యగారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో భారత స్వాతంత్ర్యోద్యమ సాయుధ విప్లవం యూరోపు దేశాలలో ఏ విధంగా ప్రచ్ఛన్నంగా నిర్వహించబడిందో చెంచయ్యగారు, అందులో వారు కూడా క్రియా శీల పాత్ర నిర్వహించారు కాబట్టి ప్రత్యక్షకథితం చేశారు. శ్రీ పాదసుబ్రహ్మణ్య శాస్త్రిగారి స్వీయ చరిత్ర అనుభవాలూ- జ్ఞాపకాలూనులో, ఈ శతాబ్ది సాహిత్య రీతుల పరిణామాలు, నాటి ప్రముఖులు, సాహిత్యపరులు ఆవేశకావేషాలు, పరస్పర విజిగీషలు, వాళ్ళ మూర్తిమంతాలు, కలం చిత్రాలుగా చిత్రించారు శాస్త్రిగారు. ఒక యుగం కనుమరుగవుతూ కొత్త యుగం ప్రారంభమవుతున్న సంధి కాలంలోని విచిత్ర సన్నివేశాలు, సంఘటనలు శాస్త్రిగారి స్వీయ చరిత్ర తెలియజేస్తుంది.

పెద్దిభొట్ల వీరయ్యగారి స్వీయ చరిత్రలో కొన్ని విచిత్రోదంతాలున్నాయి. అక్షరమంటే, అంకె అంటే ఏమిటో తెలీని దళిత వర్గాల వ్యక్తులు ఇద్దరు ఒకరు మగ, ఇంకొకరు ఆడ-కోట్ల సంఖ్య మొత్తాల హెచ్చవేతలు, తీసివేతలు చెప్ప గలగటం, న్యాయస్థానాల విశేషాలు కూడా కొన్ని వీరు వ్రాశారు.

అయ్యదేవర కాళేశ్వరరావుగారి స్వీయ చరిత్ర నా జీవిత కథలో, నవ్యాంధ్రంలో భారత జాతీయ కాంగ్రెస్ సభా స్థలాలు, విశేషాలు, ఆంధ్ర రాష్ట్రోద్యమానికి సంబంధించిన అపూర్వమైన సంగతులూ ఉన్నాయి.

రావి నారాయణరెడ్డిగారి స్వీయ చరిత్ర వీర తెలంగాణలో నాటి ఆంధ్ర మహా సభలో సిద్ధాంత విభేదాలు, తెలంగాణంలో జరిగిన సాయుధ తిరుగుబాటు వర్ణితాలు. కొండా వెంకటరంగారెడ్డిగారి స్వీయ చరిత్రలో నిజాం పరిపాలన అంతమొంది, తెలంగాణ విమోచనం తర్వాత ఏర్పడ్డ తొలి ప్రజాప్రభుత్వంలో ఎదురైన సాధక బాధకాలు వర్ణితమైనాయి. మందుముల నరసింగరావుగారి ఏభై సంవత్సరాల హైదరాబాదు అనే స్వీయ జీవితానుభవ సంపుటంలో తెలంగాణ ప్రజలను జాగృతం చేసిన ప్రజాహిత ఉద్యమాలు వర్ణితమైనాయి.

1972 వ సంవత్సరంలో వెలువడ్డ స్వామీ జ్ఞానానంద స్వీయ చరిత్ర చాలా విలక్షణమైన స్వీయ చరిత్ర. ప్రపంచ ప్రసిద్ధులైన పరమాణుభౌతిక విజ్ఞాన శాస్త్రవేత్తగా, తపోనిష్ఠా గరిష్ఠుడైన అవధూతగా స్వామివారి అనుభవాలు హృదయాహ్లాదకరములూ, ఊర్జిత కథోపేతములూ కూడా. హిమాలయాలలో తపస్సుచేసి పరా, అపరా ప్రకృతి విజ్ఞానాలను సమన్వయింప చేసిన మహాత్ములు స్వామీ జ్ఞానానంద. రాజస్థానంలోని ఆబూ పర్వత శ్రేణుల నిర్జన గిరి కందరాలలో తపస్సు చేస్తూ ఉండగా, తెలుగు అక్షరాలున్న రక్షరేకు ఒకటి వారికి కనపడటం, దానిని ధరిస్తే ఇష్టార్థ సిద్ధి అవుతుందని దాని మీద రాసి ఉండటం, ఇవన్నీ ఆశ్చర్యం కలిగించే వృత్తాంతాలు. ఆబూ పర్వత శ్రేణులలోనే నీలకంఠ మహదేవ్ అనే ప్రాంతంలో హిందూ సంప్రదాయాలను పాటించే ముస్లిమ్ సిద్ధ పురుడొకడు తారసపడటం, అతడు సృష్టించిన చిత్రవిచిత్రమైన పదార్థాలు ఆయన స్త్రీలాగా ఉడుపులు ధరించటం, పండ్లు మిఠాయిలు వివిధ సుగంధాలు ఆయన సృష్టించటం స్వామి వారు స్వయంగా చూశారు కాబట్టి ఆ విషయాలు వ్రాశారు. హిమాలయ తపోభూముల విశేషాలు అద్భుత ఉదంతాలు.

1976లో అజ్జాడ అదిభట్ల నారాయణదాసుగారి స్వీయ చరిత్ర వచ్చింది. జయంతి కామేశం, పనప్పాకం ఆనంతాచార్లుగారల జీవిత విశేషాలు, ఇతర ఆధారాల నుంచి లభించనివి నారాయణదాసుగారి ఎఱుక నుంచి తెలుస్తాయి. వారి అన్నగారి దేహపాటవం, తిండిపుష్టి ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. అదొక లోకం. చాలా అద్భుతమైన స్వీయ చరిత్ర దాసుగారిది. ఆ నాటి కొందరు ప్రముఖ వ్యక్తులను దాసుగారు పేర్లు గోపనం చేసి పరిచయం చేశారు. ఇందులో ఆ నాటి చరిత్రతో పరిచయం ఉన్నవాళ్ళు వాళ్ళను పోల్చుకోవచ్చు. ఆనంద గజపతి సంగీత సాహితీ రసికత, నాటి పండితులు, నాటి ఆట పాటలు దాసుగారి నా ఎఱుక వర్ణిస్తున్నది.

ఇటీవల వచ్చిన స్వీయచరిత్రలలో తాపీ ధర్మారావుగారి రాలూ-రప్పలూ, ఉప్పల లక్ష్మణరావు గారి బతుకు పుస్తకం, ఈ శతాబ్ది ప్రథమ దశకంలో తెలుగు దేశంలో వచ్చిన భాషా సామాజిక భావ పరిణామాలు తెలియజేస్తున్నాయి.

1982 లో మామిడిపూడి వెంకటరంగయ్యగారి 'మారుతున్న సమాజం-నా అనుభవాలు' అనే స్వీయ చరిత్ర వెలువడింది. జీవితంలో నాలుగు దశాబ్దుల పాటు ఎన్నో కళాశాలల్లో, విశ్వవిద్యాలయాలలో, అధ్యయన సంస్థలలో వెంకట రంగయ్యగారు అధ్యాపకత్వం వహించి, ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయాలు విద్యార్థులకు బోధిస్తూ, ప్రామాణికమైన గ్రంథా లెన్నో రచించారు. కొన్ని వేల గ్రంథాలను వివిధ పత్రికలలో సమీక్షించారు. తమ తొమ్మిది దశాబ్దాల జీవితంలో ఆంధ్రదేశంలో వచ్చిన మార్పులన్నిటినీ సామాజిక పరిణామ విశ్లేషణాత్మకంగా వివరించారు. రఘుపతి వెంకటరత్నం నాయుడు, సి. ఆర్. రెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణయ్య, వి. కె. ఆర్. వి. రావు, హిరేన్ ముఖర్జీ వంటి ప్రముఖులను గూర్చి తమ అనుభవాలు జ్ఞాపకాలు స్వీయ చరిత్రలో పొందుపరచారు వెంకట రంగయ్యగారు.

తెలుగులో స్వీయ చరిత్రలు రచించినవారిలో సంఘ సంస్కర్తలు, జాతీయోద్యమ నాయకులు, విశిష్ట సాహిత్య సేవావ్రతులు, మహాకవులు, రాజకీయ నాయకులు, కళావేత్తలు, కళాకారులు, సంఘ సేవాపరాయణులు, విప్లవ యోధులు, వదాన్యులూ, పత్రికా ప్రముఖులూ, ఉన్నతోద్యోగులు ఎందరో ఉన్నారు. కె. ఎస్. రావు, ఒ. పుల్లారెడ్డి వంటి మేధావులు, పరిపాలనాధురంధురులు, కోటంరాజు రామారావు వంటి సుప్రసిద్ధ పాత్రికేయులు, డి. ఎస్. శర్మ వంటి విద్యావేత్తలు స్వీయ చరిత్ర ఇంగ్లీషులో వ్రాసుకొన్నారు.

దక్షిణ భారత దేశంలో నూరు, నూట ఏభై సంవత్సరాల తెలుగుదేశపు ఆధునిక చరిత్రను, సాంఘికార్థిక రాజకీయ పరిణామాలను, సంస్కృతిలో వచ్చిన మార్పులను, జన జీవన దృక్పథాలను అధ్యయనం చేయటానికి విలువైన ఆకర వాఙ్మయం సాహిత్యంలో స్వీయ చరిత్ర శాఖ.

# 5. స్వీయ చరిత్ర - సామాజిక చరిత్ర

గడచి పోయిన కాలాన్ని గురించి వాస్తవమైన విషయాలు తెలుసుకోవాలంటే ఆనాడు ప్రత్యక్షంగా వాటిని తెలిసిన వాళ్ళు చెపితే అధికారికంగా ఆ విషయాలు తెలుస్తాయి. వీరేశలింగం స్వీయ చరిత్రలో ఆనాడు నాలుగు రూపాయల వరుంబడితో పెద్ద కుటుంబం సుఖంగా జీవించగలిగి ఉండేదని చెప్పారు. ఆనాడు పంట పొలాలకు కాలువల ఆధారం ఉండేది కాదని, వర్షాలు పడితే పండటం, లేకపోతే ఎండటంగా ఉండేదని అన్నారు. చెన్నపట్నం వెళ్ళాలంటే కాకినాడ వెళ్ళి పొగఓడ ఎక్కాల్సిందేకాని మరి గత్యంతరంలేదు. 1897 వ సంవత్సరం వరకు ఉత్తర సర్కారుల, గోదావరి జిల్లాల వారు రైలును ఎరుగరు అని చిలకమర్తి స్వీయ చరిత్రలో చెప్పారు. ఆనాడు మధ్యతరగతి కుటుంబాలలో ఇంగ్లీషు విద్యల పట్ల ఆసక్తి ఉండేది. పల్లెటూళ్ళలో క్రమక్రమంగా కుల వృత్తులు క్షీణసత్వాలైనాయి. కిందటి శతాబ్దం చివరవరకూ ఆచార్యులు శిష్యులకు తిండీ బట్టా ఇచ్చి చదువు చెప్పటం ఉండేది. ఇందుకుగాను పండితులకు వదాన్యులైనవారు, ధనవంతులైనవారు వర్షాశనాలు ఇచ్చేవారు. చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు చర్ల బ్రహ్మయ్య శాస్త్రి గారి దగ్గర యీ విధంగా చదువుకున్నారు. వెంకట శాస్త్రి గారు కాశీయాత్ర అని కాశీలో తమ విద్యాభ్యాసానికి దారి తీసిన పరిస్థితులు, అక్కడికి వెళ్ళటం, ఆనాటి కాశీపట్టణ స్థితిగతులు, విద్యార్థుల చదువు సాములు గూర్చి వ్రాశారు. ఇప్పుడు విశ్వవిద్యాలయాల విద్యార్థులు మాదకద్రవ్యాలకు అలవాటుపడి చదువు సంధ్యలను, శరీరారోగ్యాన్ని, జాతీయ సంస్కృతినీ భంగపుచ్చుతున్నారని వార్తాపత్రికలలో చూస్తున్నాం. బాధ్యతకలవారు, పెద్దలైనవారు బాధపడుతున్నారు. కాశీలో నిష్ఠగాశాస్త్రాలు చదువుకొనే విద్యార్థులలోనూ భంగు సేవనం ఉండేదనీ, ముఖ్యంగా చదువు పూర్తి అయి సమాపనోత్సవం నాడు భంగు వినియోగం బాగా జరిగేదని, బలవంతంగా తనను కూడా అట్లా సేవింప చేస్తే తాను చాలా బాధ పడ్డానని వెంకటశాస్త్రి గారు కాశీయాత్రలో వ్రాసుకున్నారు. ఆయన స్వీయ చరిత్రలో యీ వృతాంతం ఏక దేశం. తన వివాహం వరకు కథ ఇందులో ప్రసక్తం.

ఆ నాటి జమీందారులు, ధనికులు, పాడీపంట కలవారు, విద్వత్తును ఏ విధంగా పోషించేవారో ఇందులో శాస్త్రిగారు వివరించారు. తిరుపతి వెంకట కవుల స్వీయ చరిత్రోదంతం జాతక చర్య, ఇటీవలి చర్య పేరిట రెండు సంపుటాలుగా ప్రకటితమైంది. కాని ఇది పద్యకావ్యం. ఇట్లా పద్యకృతులుగా స్వీయచరిత్రను వెలువరించిన వారిలో పెన్మత్స సత్యనారాయణ రాజు, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, గుర్రం జాషువా గారి లాంటి ప్రముఖులున్నారు.

జానపాటి పట్టాభిరామశాస్త్రిగారి జీవిత చరిత్రలో ఆనాటి సామాజిక పరిణామాలకు సంబంధించిన అపూర్వాంశం ఒకటి ఉన్నది. అదేమంటే, సైనిక పటాలంతోపాటుగా ఒక సంచార పురోహితుడు ఉండటం. అంటే ఆ సైనిక పటాలంలోని సిపాయిలు కర్మకాండ పట్ల ఆనాటికి నమ్మకంతో, మంచి చెడ్డలను పూజా పునస్కారాలను ఆ పురోహితుడితో నిర్వర్తింపచేసుకొనే వారన్నమాట. నూరు నూటపాతిక సంవత్సరాల క్రిందట కంపెనీ ప్రభుత్వం వారు దేశీయులైన సిపాయిలను దండులో చేర్చుకొనేటప్పుడు వాళ్ళ కులాచారాలు, కుల చిహ్నాలు విసర్జించాలనే నిబంధన ఉండేది కాదు. అందువల్ల తిధి వార నక్షత్రాలు, శుభాశుభ శకునాలు మొదలైనవి చెప్పటానికి, స్వగ్రామంలో పురుడు పుణ్యాలు తటస్తే శాంతిదాంతి క్రియా కలాపం పూనటానికి దండు సిపాయిలకు ఒక పురోహితుడు కూడా అవసరమై ఉంటాడు. దండువారు ఒకచోటి నుంచి ఒకచోటికి కదలినప్పుడు ఈ అయ్యవారు కూడా వాళ్ళతో ప్రయాణం చేయాల్సివచ్చేది. ఈ విధంగా పట్టాభి రామశాస్త్రిగారి తండ్రిగారు దండువారితో తిరిగి, తమిళ, మహారాష్ట్రాది భాషలు కూడా నేర్చుకున్నారని స్వీయ చరిత్రలో ప్రస్తావించారు.

ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్రలో సాంఘిక చరిత్రకు పనికివచ్చే అనేకమైన అపూర్వాంశాలున్నాయి. ఉత్తర భారతదేశానికి, దక్షిణ భారత దేశానికి కర్మకాండలోను, ఆచార వ్యవహారాలలోను ఉండే భేదాలు, వాటికి కారణాలు వర్ణించారు. గంగకుండా ప్రయాణం చేసే వాళ్ళకు అద్దెకు పడవ ఇండ్లు దొరికేవని, వాటిని బజరాలనే వాళ్ళని, రోజుకు 7 రూ॥ల బాడుగ ఇవ్వాలని వీరాస్వామయ్య వ్రాశారు. అంతేకాకుండా, ఆయా ప్రాంతాలలోని శీతోష్ణస్థితులు, భూసారం, మనుష్యుల అందచందాలు, దృఢగాత్రత, శాంతి భద్రతలు, రూపాయిమారకం, వినియోగం, యీ విషయాలన్నీ వీరాస్వామయ్య గారు వర్ణించారు. అప్పుడప్పుడే బలపడుతున్న కంపెనీ పరిపాలన వ్యవస్థ, ఆనాటి

ఉన్నతోద్యోగులు, వాళ్ళు భారతదేశ మత సంస్కృతిపట్ల కనపరచిన జిజ్ఞాస, వాళ్ళతో వీరాస్వామయ్యగారు చేసిన చర్చలు కాశీయాత్రా చరిత్రలో ప్రసక్తమైనాయి.

వెన్నెలకంటి సుబ్బారావు పద్దెనిమిదో శతాబ్దంలో పుట్టి పంధొమ్మిదో శతాబ్దంలో నాలుగు దశాబ్దులు జీవించారు. కర్ణాటకంలోను, మద్రాసులోనూ ప్రభుత్వోద్యోగాలు నిర్వహించారు. నాలుగుసార్లు భార్య మరణంతో వీరు మళ్ళీ వివాహం చేసుకున్నారు. ఆనాడు బాల్య మరణాలు తరచూ సంభవించేవని యీయన స్వీయచరిత్ర ద్వారా తెలుస్తుంది. సరిఅయిన వైద్య సదుపాయాలు లేకను, సకాలంలో అవి అందటానికి అవకాశం లేకను, ఒకచోటి నుంచి మరొకచోటికి త్వరగా ప్రయాణించటానికి తగిన యానసాధనాలు, రవాణా సౌకర్యాలు లేకను, జీవన ప్రమాణం, సగటు ఆయుః ప్రమాణం తక్కువగా ఉండేది. రాష్ట్ర గవర్నర్ మన్రోదొర రాయలసీమలో పర్యటనలో ఉండగా కలరా తగిలి ఆయన 1826 లో మరణించారు. పత్తికొండ కాంపులో యీ విషాద సంఘటన జరిగింది. గుత్తిలో ఈయనను సమాధి చేశారు. ఈ విషయాలన్నీ సుబ్బారావు స్వీయ చరిత్రలో నమోదు చేశారు. ఆనాటి ప్రకృతి బీభత్సాలు, తుఫానులు, గాలివానలు, కరువులు, కాటకాలు, ప్రభుత్వ కచ్చేరీలు, జీతాలు, పింఛన్ వివరాలు అన్నీ సుబ్బారావు స్వీయ చరిత్రద్వారా తెలుస్తాయి. 1822 లో గుంటూర్లో తూము పాపయ్య గారనే వారు చనిపోతే, ఆయన ఇల్లాలు సహగమనం చేయటం తాము చూశామని సుబ్బారావు స్వీయచరిత్రంలో వ్రాశారు. అటుతర్వాత ఏడు సంవత్సరాలకుగాని సహగమన నిషేధచట్టం అమలులోకి రాలేదు. వీరాస్వామయ్యగారి లాగా సుబ్బారావు గారు కూడా ఉన్నత న్యాయస్థానంలో ద్విభాషిగా సుమారు 20 సంవత్సరాలు పనిచేశారు. కాశీయాత్ర మాత్రమే కాకుండా రామేశ్వరయాత్ర కూడా చేశారు సుబ్బారావుగారు. ఈ యాత్రలో దక్షిణ భారతదేశంలోని ఆనాటి సామాజిక పరిస్థితులు వర్ణించబడ్డాయి. 1836 ప్రాంతాలలో వెన్నెలకంటి సుబ్బారావు యీ స్వీయ చరిత్ర ముగించారు. 1968 లో శివరాజు వెంకట సుబ్బారావు (బుచ్చిబాబు) అంతరంగ కథనం వెలువడింది. ఈ తరం సృజనాత్మక ప్రతిభావంతుడైన గొప్ప రచయిత బుచ్చిబాబు. తాను చూసిన ప్రపంచాన్ని తన రచనలలో ఎలా వాడుకున్నదీ అంతరంగ కథనంలో ఆయన చెప్పారు. 1930వ సంవత్సరం వరకూ భోగం మేళాలుండేవన్న విషయం బుచ్చిబాబు అంతరంగ

కథనంలో ప్రసక్తం చేశాడు. నాటకాల ప్రాముఖ్యం పోయి అప్పుడే సినిమాలు మొదలు కావటం, స్వాతంత్ర్యోద్యమం, కులాచారాలు క్రమంగా సడలిపోతూ వుండటం బుచ్చిబాబు అంతరంగ కథనంలో విశ్లేషించాడు.

బులుసు వేంకటేశ్వరులుగారి స్వీయ చరిత్ర పేరు సర్వదుఃఖ నివారణో పాయము. అంటే ఆయన అనుభవంతో తెలుసుకున్న జ్ఞానసాధన మార్గాలు ఇందులో చెప్పారు. తమ జీవిత ఘట్టాలతో సమన్వయింపచేస్తూ జీవితంలో మానవులు ఏ దృక్పథాన్ని అలవరచుకొంటే దుఃఖాలను దూరీకరించగలరో ప్రతి పాదించారు. సుప్రసిద్ధులైన కర్మిష్ఠుల కుటుంబంలో పుట్టి, జ్ఞానవిజ్ఞాన సమన్వయం తెలుసుకున్నవారు వేంకటేశ్వర్లు. ఈ శతాబ్ది సామాజిక పరిణామాల హేతువు లేమిటో చక్కగా విశ్లేషించారు వేంకటేశ్వర్లు గారు.

కొన్ని శతాబ్దులుగా సమాజంలో చెలామణీ అవుతున్న కులవృత్తులు, వ్యావసాయిక జీవన విధానమూ ఏయే కారణాలవల్ల మార్పులు చెందాయో, ఆ విధంగా మార్పులు చెందినందువల్ల జీవన విధానంలో వచ్చిన సంఘర్షణ లేమిటో వేంకటేశ్వర్లు గారి స్వీయ చరిత్రం వివరిస్తున్నది.

బుచ్చిబాబు అంతరంగ కథనంలో 'కోమలి' పాత్ర విశిష్టమైనది. ఆ పాత్రను జీవితంలో సన్నిహితంగా ఎరిగిన వ్యక్తి పేరు నుంచి గ్రహించినట్లుగా ఆయన పేర్కొన్నారు. ఒక వర్గం వారిలో దంభ ప్రవృత్తి, మడీమైలా, దృష్టి దోషాలు, ఆధిక్యతా భావాలు ఈ శతాబ్ది పూర్వార్ధం వరకూ ఏ విధంగా చెలా మణిలో ఉండేవో బుచ్చిబాబు చివరకు మిగిలేది నవలలో ఒక సన్నివేశంద్వారా చిత్రించారు. అది ఆయన నిజ జీవితంలోంచి నవలీకరించిన సన్నివేశమే.

ఇంగ్లీషు చదువులవల్ల, స్వాతంత్ర్యోద్యమం ప్రభావంతోను, సమాజంలో ఉదార దృక్పథమూ, సంస్కరణ భావాలు, జాతీయతా స్ఫూర్తి ఏవిధంగా పెంపొందుతూ వచ్చాయో జాతీయోద్యమ నాయకుల, రాజకీయ నాయకుల స్వీయ చరిత్రలవల్ల తెలుస్తున్నది.

కవికొండల వెంకట సత్యనారాయణమూర్తి గారి స్వీయ చరిత్రం అముద్రితం. వీరు విశాఖ, విజయనగరం ప్రాంతాలలో పాఠశాలోపాధ్యాయులుగా నాలుగు దశాబ్దుల కాలం పనిచేశారు. జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆనాటి జిల్లా బోర్డు పరిపాలన, రాజకీయ సంఘటనలు, ఆధ్యాత్మిక సంఘాల కపటాలు,

స్వీయానుభవపూర్వకంగా నమోదు చేశారు. 1932 ప్రాంతం సాంఘిక పరిస్థితులను వారిట్లా చిత్రించారు:

''ఆ దినములలో రాజకీయ పరిస్థితులు చాలవిషమంగా నుండెను. ఫిబ్రవరి 2 వ తేదీన మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారిని యలమంచిలిలో నిర్బంధించిరి. ఆ దినములలోనే చీనాకు జపానుకు కూడ పోరాటము ప్రారంభమయ్యెను. భారత దేశములో నిర్బంధ విధానము ప్రచండ రూపమును ధరించినది. నిర్బంధింప బడినవారి పేర్లుగాని ఛాయా పటములుగాని పత్రికలో ప్రచురింపకూడదని దొర తనము వారు ఆజ్ఞాపించిరి. వాలంటీర్లను అడవులలోనికి తీసికొని పోవుట, అక్కడ వారి గుడ్డలువిప్పి దిగంబరులుగా చేసి వారిపై లాటీచార్జీ చేయుట మొదలగు అమానుష కృత్యములు కూడ ప్రారంభమయ్యెను. ఇక ఆర్డినెన్సులకు లెక్కయే లేదు.'' 1927 ప్రాంతానికి విశాఖపట్టణం జిల్లా బోర్డు అజమాయిషీలో నాలుగు చోట్ల మాత్రమే హైస్కూళ్ళుండేవి అని సత్యనారాయణమూర్తిగారు వ్రాశారు. గంజాం జిల్లా విశేషాలెన్నో కూడా మూర్తిగారు స్వీయ చరిత్రలో అక్షరబద్ధం చేశారు. 1946 వ సంవత్సరం ఏప్రిల్ నెలలో ఏర్పడిన ప్రకాశం పంతులుగారి రాష్ట్రమంత్రి వర్గం గురించి, అటు తరవాత ఓమాండూరి రామస్వామిరెడ్డియార్ గారి మంత్రివర్గం గురించి, ఆనాటి పరిపాలన పద్ధతులను గురించి సత్యనారాయణమూర్తిగారి స్వీయ చరిత్రలో విశేషాలు నమోదై ఉన్నాయి. కవి కొండల సత్యనారాయణమూర్తిగారు 1930 వ సంవత్సరం యరవాడ జైలులో నిర్బంధితులై ఉన్న మహాత్మాగాంధీతో ఆస్తికతను గూర్చి ఆయన అభిప్రాయం తెలుసుకొవటానికి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. సత్యాహింసలు, సత్కర్మాచరణం, ఆస్తికతలగూర్చి గాంధీజీ అక్టోబరు 15 వ తేదీతో వ్రాసిన ఉత్తరం స్వీయ చరిత్రలో ఉట్టంకించారు మూర్తిగారు. ఉత్తర భారతంలో గొప్ప పత్రికా సంపాదకుడిగా పేరు ప్రఖ్యాతులు పొందిన సి. వై. చింతామణిగారు 1940 వ సంవత్సరం వీరికి వ్రాసిన ఉత్తరం యీ స్వీయ చరిత్రలో పొందుపరిచారు సత్యనారాయణమూర్తిగారు. మొదటి ప్రపంచ యుద్ధం, రెండో ప్రపంచ యుద్ధం నాటి ఆంధ్రదేశ సాంఘిక రాజకీయ పరిస్థితులన్నీ సత్యనారాయణమూర్తిగారి స్వీయ చరిత్రలో విపులంగా ఉన్నాయి.

అయ్యదేవర కాళేశ్వరరావుగారి స్వీయ చరిత్ర నా జీవిత కథ-నవ్యాంధ్రం వల్ల ఆంధ్రదేశంలో నూటయాభై సంవత్సరాలుగా సామాజిక సాంస్కృతిక

జీవనంలో వస్తూఉన్న, వచ్చిన మార్పులు విశదమవుతాయి. ఆయన 1881 వ సంవత్సరం జన్మించారు. అంతకు ముందు అర్ధశతాబ్దంగా తెలుగుదేశపు చరిత్రలో సాంఘిక జీవనంలో రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా ఎటువంటి మార్పులు సంభవిస్తూ వచ్చాయో కాశేశ్వరరావు క్రమ పరిణామాత్మకంగా సమీక్షించారు ఆ రోజుల్లో వీధి బడులలో చదువులు ఎట్లా ఉండేవో, యక్షగానాలు, పగటి భాగవతులు, నాటక సమాజాలు ఏ విధమైన వినోద సాధనాలుగా ఉండేవో, ఇంగ్లీషు చదువులు ఎప్పుడు ఎట్లా ఆకర్షణమైనవో ఆయన విశ్లేషించి చూపారు. తెలుగు దేశంలో అగ్రవర్గాల వారిలో క్రైస్తవ మతప్రవిష్టులైన పది కుటుంబాల వారిని ఆయన పేర్కొన్నారు. అప్పటి పాఠశాలలు, మిషనరీల ప్రచారం, బ్రహ్మసమాజ ప్రభావం, సంఘ సంస్కరణోద్యమాలు, వీటి కారణాలు కాశేశ్వరరావుగారు స్వీయ చరిత్రలో ఉట్టంకించారు. నూరేళ్ళ కిందటి వరకూ పాఠశాలల్లో ఉర్దూ, పార్శీలు నేర్పటం ఉండేదని కొండ వెంకటప్పయ్య పంతులుగారు, కాశేశ్వరరావుగారూ కూడా వ్రాశారు. ఇంగ్లీషు వాళ్ళ ప్రభుత్వం ఎక్కువ కాలం మనజాలదనీ, మళ్ళీ నిజాం సర్కారుగాని, ఢిల్లీలో మొగలాయిలుగాని ప్రభుత్వాన్ని మళ్ళీ కైవసం చేసుకుంటారని, అందువల్ల ఉర్దూ పార్శీలు నేర్చుకోవల్సిన అవసరం ఉందని సమాజంలో విద్యావంతుల వర్గం భావించేవారని కొండ వెంకటప్పయ్య పంతులు వ్రాశారు. సర్కారు జిల్లాల్లో బ్రహ్మసమాజ ప్రభావమూ, రాయలసీమ జిల్లాలలో దివ్యజ్ఞాన సమాజ ప్రభావమూ, తెలంగాణం జిల్లాలలో ఆర్యసమాజ ప్రభావమూ అధికంగా ప్రసరించటానికి కారణాలు సూచించారు కాశేశ్వరరావుగారు. ఇందువల్ల సమాజ చరిత్రను, పరిణామాలను అవగాహన చేసుకోవటానికి మేధావుల స్వీయ గాథలు, విశ్లేషణలు ఎంతగానో ఉపకరించగలవని తెలుస్తున్నది.

ఉప్పల లక్ష్మణరావుగారి బతుకు పుస్తకం 1983 లో వెలువడింది. లక్ష్మణరావుగారు అభ్యుదయ భావాలు కలిగి సోషలిస్టు ఉద్యమాలలో పనిచేసిన స్విస్ వనిత మెల్లీ షోలింగర్‌ను వివాహమాడారు. మాస్కోలో తెలుగు ప్రచురణల నిర్వాహకుడిగా పనిచేశారు. వీరి స్వీయచరిత్ర ద్వారా యీ శతాబ్దిలో ఆర్థిక రాజకీయ భావ విప్లవాలు తెలుగు దేశాన్ని ఏమేరకు ప్రభావితం చేశాయో తెలుస్తుంది. వీరేశలింగం మరణకాలం నుంచి క్విట్ ఇండియా ఉద్యమ కాలం వరకు తెలుగు నాటి భావవిప్లవం, జాతీయోద్యమంలో వచ్చిన సోషలిస్టు సిద్ధాంత ఉద్యమాలు సాధికారికంగా వివరించారు లక్ష్మణరావుగారు. లక్ష్మణరావు

గారి స్వీయ చరిత్ర ద్వారా యీ శతాబ్ది ప్రపంచ సోషలిస్టు ఉద్యమాల సార భూతమైన విషయాలు తెలియటం కూడా విశేషం.

ఆచార్య మామిడి పూడి వెంకట రంగయ్యగారి స్వీయ చరిత్ర ద్వారా ఒక శతాబ్దిలో సంఘంలో, ముఖ్యంగా విద్యా వైజ్ఞానిక రంగాలలో వచ్చిన పరిణామాలు తెలుస్తున్నాయి. వెంకట రంగయ్యగారు సామాజిక శాస్త్రవేత్తలు. ఆర్థిక రాజకీయ రంగాలలో విశేషమైన అవగాహన కనపరిచినవారు సమాజంలో వచ్చిన, వస్తూ ఉన్న మార్పుల నన్నిటినీ ఆయన ఈ దేశపు తరతరాల సాంస్కృతిక జీవన విశ్వాసాలతో విశ్లేషించి ప్రతిపాదించారు స్వీయ చరిత్రలో. అందుకనే తమ జీవితానుభవ సంపుటికి 'మారుతున్న సమాజం- నా అనుభవాలు' అని వారు పేరు పెట్టారు.

''ప్రతి సమాజంలోను ప్రజలు ఏవో కొన్ని నమ్మకాలను ఆధారం చేసుకొని జీవిస్తారు. ఇది తప్పదు. విజ్ఞానశాస్త్రము, హేతువాదము అభివృద్ధి గాంచిన పాశ్చాత్య దేశాలలో కూడా ఎన్నో మూఢనమ్మకాలు వున్నవి. మానవాళి విముక్తికి విజ్ఞానశాస్త్రం ఏకైక సాధనమనేది కూడ మూఢనమ్మకమే. విజ్ఞాన శాస్త్రాభివృద్ధి అణ్వస్త్రాలకు దారితీసినదని, ఈ అస్త్రాలు మానవాళి మనుగడకే ముప్పు తెచ్చి పెట్టేవని రెండవ ప్రపంచ యుద్ధం స్పష్టం చేసింది. ఈలాగే కమ్యూనిష్టు దేశాలలో మార్పు 150 సంవత్సరాల క్రిందట ఆనాటి పరిస్థితులను ఆధారం చేసుకొని ప్రతిపాదించిన సిద్ధాంతాల పట్ల మూఢనమ్మకం ప్రాబల్యం గాంచి వుంది.''

''బ్రిటిషు పరిపాలనలో రవాణా సౌకర్యాలు పెరిగిన కారణంగాను, కేంద్రీకృతమైన పరిపాలన స్థాపింపబడడంచేతను గ్రామస్వరాజ్యం, స్వయంపోషకత్వం క్షీణించినవి.'' ఈ విధమైన విశ్లేషణలే కాకుండా స్వాతంత్ర్యానంతరం భారత దేశ సామాజికార్థిక రాజకీయ వ్యవస్థలోని పరిణామము మంచి చెడ్డలు విశ్లేషించి చూపారు వెంకట రంగయ్యగారు.

ఈ విధంగా తెలుగులో ఈ నూరు నూటయాభై సంవత్సరాలలో వచ్చిన నూరు నూటయాభై స్వీయ చరిత్రలు, స్వీయ చరిత్రాత్మక రచనలవల్ల ఆధునిక శతాబ్దాల తెలుగుదేశపు సామాజిక చరిత్రను సాధికారంగా నిర్మించవచ్చు.

వ్రాతప్రతులు, దినచర్య పుస్తకాలు, లేఖలు, అనుభవాలు - జ్ఞాపకాలకు సంబంధించిన రచనలు, స్మృతులు ఈ అధ్యయనంలో పరిశీలించవలసిఉంటుంది.



# తెలుగులో కొన్ని ప్రముఖమైన స్వీయ చరిత్రలు

1. జీవయాత్రా చరిత్ర - వెన్నెలకంటి సుబ్బారావు - ఇంగ్లీషు.
(ప్రచురణ 1873, అనువాదం 1976)
2. ఆత్మపర్యాయ సపర్యాచర్య - మండపాక పార్వతీశ్వరశాస్త్రి, (1894).
3. స్వీయ చరిత్రము - కందుకూరి వీరేశలింగం
(మొదటి భాగం 1911, రెండవ భాగం 1915)
4. స్వీయ చారిత్రం - రాంభొట్ల జగన్నాథశాస్త్రి. (1916).
5. ఆత్మ చరిత్రము - రాయసం వెంకటశివుడు, (1933).
6. స్వీయ చరిత్రము (సూర్యనారాయణీయము) (1936)
-వల్లూరి సూర్యనారాయణరావు
7. స్వీయ చరిత్రము - చిలకమర్తి లక్ష్మీనరసింహం
8. నా జీవితయాత్ర - టంగుటూరి ప్రకాశం
9. స్వీయ చరిత్ర - కొండ వెంకటప్పయ్య
10. ప్రజ్ఞాప్రభాకరము - వేటూరి ప్రభాకరశాస్త్రి
11. నా చిన్ననాటి ముచ్చట్లు - కె. ఎన్. కేసరి
12. స్వీయ చరిత్ర - పెద్దిభొట్ల వీరయ్య
13. నా జీవిత కథ - నవ్యాంధ్రము - అయ్యదేవర కాళేశ్వరరావు
14. శ్రీకృష్ణ స్వీయ చరిత్ర - శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
15. అనుభవాలూ - జ్ఞాపకాలూను - శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
16. సాగుతున్న యాత్ర - స్మృతిపథంలో - ఆచంట జానకిరామ్
17. తెగిన జ్ఞాపకాలు, స్మృతిబింబాలు, గతంలోకి-సంజీవదేవ్
18. స్వీయ చరిత్ర - మాదిరాజు రామకోటేశ్వరరావు
19. స్వీయ చరిత్ర - కొండా వెంకట రంగారెడ్డి
20. వీర తెలంగాణ - రావి నారాయణరెడ్డి
21. నటస్థానం - స్థానం నరసింహారావు
22. స్వీయ చరిత్ర - ఆచంట లక్ష్మీపతి
23. నేను-నా దేశం - దర్శి చెంచయ్య
24. గడిచిన రోజులు - పి. తిరుమలరావు
25. నా జీవిత నౌక - గొట్టిపాటి బ్రహ్మయ్య
26. నా ఎఱుక - ఆదిభట్ల నారాయణదాసు
27. అంతరంగ కథనం - బుచ్చిబాబు
28. స్వీయ చరిత్ర - దువ్వూరి వెంకటరమణశాస్త్రి
29. స్వీయ చరిత్ర - నడింపల్లి నరసింహారావు
30. ఏభై సంవత్సరాల హైదరాబాదు - మందుముల నరసింగరావు

31. స్వీయ చరిత్ర - మునిపల్లె స్వామి
32. స్వీయ చరిత్ర - స్వామి జ్ఞానానంద
33. స్వీయ చరిత్ర - గిడుగు సీతాపతి
34. స్వీయ చరిత్ర - తెల్లాకుల జాలయ్య
35. నా జీవిత యాత్ర - దాసరి లక్ష్మణస్వామి
36. చలం - చలం
37. స్వవిషయం - లింగం వీరభద్రయ్య చౌదరి
38. రాలూ-రప్పలూ - తాపీ ధర్మారావు
39. బతుకు పుస్తకం - ఉప్పల లక్ష్మణరావు
40. మారుతున్న సమాజం-నా అనుభవాలు - మామిడిపూడి వెంకటరంగయ్య
41. అప్పారావుగారూ-నేను - బసవరాజు రాజ్యలక్ష్మమ్మ
42. జాతక చర్య - జానపాటి పట్టాభిరామశాస్త్రి
43. జాతకచర్య-ఇటీవలిచర్య - చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి
44. తెనుగురాజు - పెన్మత్స సత్యనారాయణరాజు
45. నా కథలు - తుమ్మల సీతారామమూర్తి చౌదరి
46. నా కథ - గుర్రం జాషువ
47. నా సాహిత్య జీవితం - గొర్రెపాటి వెంకటసుబ్బయ్య
48. సాహితీ జీవితం - పాలా వెంకట సుబ్బయ్య
49. పాలేరు నుంచి పద్మశ్రీ వరకు - భోయి భీమన్న, శ్రీమతి హైమవతి
50. ఏభై సంవత్సరాల జ్ఞాపకాలు - దేవులపల్లి రామానుజరావు
51. 60 సం॥ల అనుభవాలు - నల్లగొండ రామచంద్రరావు
52. నా జీవిత విశేషాలు - నెల్లూరు వెంకట్రామా నాయుడు
53. సచారిత్రము - శృంగారకవి సర్వారాయకవి
54. స్వీయ చరిత్ర - కస్తూరి శివశంకర కవి
55. అండమాన్ జీవితం - ప్రతివాది భయంకరాచార్యులు
56. జీవితానుభవాలు - కోలవెన్ను రామకోటీశ్వరరావు
57. స్వీయ జీవిత సమీక్ష - కామరాజు హనుమంతరావు
58. స్వీయ చరిత్ర - బండారు తమ్మయ్య
59. భారతీదేవి స్మృతులు - ఎన్. జి. రంగా
60. సర్వ దుఃఖ నివారణోపాయము అను స్వీయ చరిత్ర - బులుసు వేంకటేశ్వర్లు
61. స్వీయ చరిత్ర - నిడుదవోలు వెంకటరావు






తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3